ఓం

శ్రీమజ్జరుగు వేంకటగురు పరబ్రహ్మణేనమః.

# ప్రాణలింగ శతకము—బ్రహ్మానంద సుధాలహరి.

ఇందు బ్రహ్మానంద సుధాలహరియందు ప్రథమభాగంబు

జరుగు వేంకటసద్గురుస్వామివారిచేతను,

ప్రాణలింగశతకము, బ్రహ్మానందసుధాలహరి ద్వితీయభాగము

గాజుల రామస్వామి చేతను

రచియింపఁబడి

---

తెనాలి రజత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1000 ప్రతులు. శుక్లనామ సం॥ర మాఘమాసము.

కాపీరైటు ] 1930. [ వెల రు 0-8-0

# పీ ఠి క

గుణగ్రహణ పారీణులరగు పాఠకమహాశయులారా! ఈచిన్న పొత్తమందలి ప్రాణలింగశతకములోని పద్యములు పురాణ స్మృతులలోని నాసంశయములు గల పద్యములు. అవి మీ మనంబుల కొకింత కఠినముగా దోచనచ్చును. గాని నాసంశయములను యుక్తియుక్తముగా సమన్వయించి బోధించినచో వికటముగాదోచిన వెల్లను పునర్ముద్రణమున సవరించుకొనియెద నని వినయపూర్వకముగా మనవి జేయుచున్నాడ. ఇక కవిత్వములోని లోపంబులు కొల్లలుగానున్నవని నేనెఱుంగుదును. ఇదియే ప్రథమ ప్రయత్నమవుటచే లోపంబులెన్నియో గలవు. వానినన్నిటి పునర్ముద్రణమున సవరించికొనియెద. ఇట్లుగాక తప్పులెన్నునెడల తప్పులేనివారు లేరనుట బుధజనులకు విదితమయ్యేయున్నది. ఇది ప్రాణలింగశతక ప్రస్తావన. ఇంక బ్రహ్మానందసుధాలహరిలోని కీర్తనలు చాల భాగము భగవానులగు శ్రీమజ్జరుగు వేంకటసద్గురు స్వాములవారి విరచితములు. అందును తొట్రుపాటులున్నయెడల నవి నా తప్పులేకాని శ్రీవారివికావు. ఏమన వ్రతత్కృతులు ఒకచోటగాక పరిగధాన్యమట్లు కూర్చుటలో అయ్యవి నాయపరాధములేనని మనవిచేయుచున్నాడ. రెండవ

భాగములో కీర్తనలలోనేమి వృత్తములలోనేమి ప్రాణలింగశతకమట్టులనే నాయొను భవమున్నంత వ్రాసినాడ. నిందును దోషంబులు లేకపోలేదు. దోషరహితంబుగా గ్రంధమును వ్రాయ నే సర్వజ్ఞుండనుగాను. బుధవరేణ్యులు గుణమునే గ్రహించి దోషంబుల బరిత్యజించెదరని నమ్ముచున్నాడ.

జరుగు వేంకటసద్గురు స్వాములవారి చరిత్రసంగ్రహము.

శ్రీశుండును అనంతుండును భక్తజనశులభుండును నగు సర్వేశ్వరుండు భక్తహితార్థమై బందరుశోని బుట్టయ్యపేటలో నివసించు జరుగు రఘునాయకులు మహలక్ష్మమ్మ యను పుణ్యదంపతుల గర్భంబున యవతరించినతోనే పరమాత్మున కాగమచయంబులు వందులౌటచే వేదంబులే సోదరీమణులై యవతరించిన మాతృపితృ లమ్మహాత్మునకు(కలౌ వేంకటనాయకా)యును న్యాయంబుననుసరించి మాయామానుషవిగ్రహుండైన పరాత్పరునకు వేంకటనామాంకితంబొసర్చి క్రమంబుగా బుత్రికారత్నంబులకును రత్నమాంబ శీతమాంబ లక్ష్మమాంబ రుక్మిణాంబ యని నామంబు లిడికొని సాకుచుండిరి. భగవానుండు దినదినప్రవర్ధమానుండై తానవత

రించిన కార్యంబుందలంచి యస్మదాదులగు రామిశెట్టి పిచ్చయ్యా తోట గోపాల కృష్ణయ్యా ఉప్పుగడ్ల సుబ్రహ్మణ్యాదేవర బందరులోనే అరవగూడెములో నివసించు రామోజీ యింటిపేరరుంగను. గ్రంధవిస్తరభీతిచే నందరిపేరులను వ్రాయవిగమించెదను. ఇత్యాదులగు భక్తుల ననుగ్రహించి స్వస్థానమలంకరించి రందు రఘునాయకులును జ్యేష్టసోదరియును పరమపదమలంకరించిరి. రెండవ సోదరియగు సీతమాంబ వైదువుగా సంతానవతిగాను మూడవ సోదరి సంతానరహితయు గతభర్తృకగాను నాల్గవ సోదరి సంతానవిహీనయై సుమంగలిగాను అవనిగడ్డ తాలూకా మాచవర గ్రామంబులలోను లింగారెడ్డిపాలెము పోటుమెరక గ్రామంబులలోను సుఖులైయున్న వారందు జ్యేష్టసహోదరి పరమపదమొందునాటికి వెంకటసుబ్బయ్య సూర్యప్రకాశరావులను సుతద్వయంబును ఒకసుతయు నామంబేనెరుంగను. వీరి తండ్రి రెడ్డౌతు సుబ్బయ్యనాయుడుగారు సంతానము బాల్యావస్థయందుండుటచే పునర్వివాహము గావించుకొని ఎల్లరును సుఖంబున్నవారు. భగవానుని మోసికనిపించిన దివ్యదేహమిప్పటికిని దరిశనభాగ్యంబొసంగుచు పతిరహితయగు సుతగృహంబున నపర్యాలం [illegible]నయది. ఇది సంగ్రహము. నే [illegible] వారి చరిత [illegible] పద్యరూ

పముగా వ్రాసినాడ. కారణాంతరములవల్ల నేనందందు గృమ్మరుస్థితియం దెచ్చుట బెట్టి మరచితినో జ్ఞప్తి లేదయ్యె. సద్గురుకరుణావిశేషంబున్న పునర్ముద్రణ భాగ్యంబు సమకూరినచో శ్రీవారి చరిత్రంబుతో తత్కృతులను పొందుపరచి ముద్రింపించెద. పాఠకలోకమిం దెన్నితప్పులున్నను మన్నింతురని ప్రార్థించుచూ ప్రస్తుత మింతటితో విరమించుచున్నాడ.

ఇట్లు బుధజనవిధేయుడు, గాజుల రామస్వామి.

—:o:—

# పండితాభిప్రాయము

ఆంధ్రదేశమం దిదివర కెందరో భక్తాగ్రేసరు లనేకవిధముల తమ భక్తిని వెల్లడించు శతకరాజంబు లెన్నియో రచించియుండుట సర్వజనవిదితము.

తత్సంబంధశతకరాజంబు లన్నియు నెక్కుడాముష్మికాత్మకములై యలరారుచుండెనుగాని యైహికాముష్మికాత్మకములను బోధించునవి చాలాకొరంతగా నున్నవను యభిప్రాయానుకూల్యముగ వీ రీశతకరాజమును రచించి యీ యనుమానమును లోకమునకు దీర్చినందులకు శ్రీ గ్రంథకర్త గారికి శ్రీ ప్రాణలింగస్వామి చిరాయురారోగ్యంబు లొసంగుగాత యని వేడుచుంటిని.

ఈగ్రంథము మిక్కిలి ప్రదలాలిత్యము గలిగియు భావపూరితమై ధారానమృద్ధియం
జత్యంతసరళమైనదియై యొప్పుచున్నదనుట నిస్సందేహము. అక్కడక్కడ భాషా
సౌభాగ్య మొనఁగూర్చు వ్యాకరణమార్గమునందు వెనుకబడినను భక్తాగ్రేసరుఁడగు
బమ్మెర పోతనామాత్యుడు బాణాల శివశరభేంద్రుడు మొదలగు వారిపథమునను
సరించియుండెననుట యదార్థమునకు దూరముగాదు.

ఇందు వ్రాయబడిన విషయములు జాలభాగము విమర్శనాయత్తచిత్తుఁడై
కవి వ్రాసినాడనుటకు చదువరులు సందేహించరు.

ఇక్కవి కవిత్వము ప్రయత్నమొనరించి సంపాదించినదిగాక సహజగమన
ముగలదియనుట శతకమందలి పద్యగమనమే చెప్పక చెప్పుచున్నది.

గాన ఆంధ్రభాషాసేవకులగు దేశీయసోదరులెల్లరును నిట్టి శతకరాజములను
సాదరాభిమానులై పఠించి యైహికాముష్మిక ఫలప్రాప్తినొందెదరుగాక యనియు
నిట్టి భక్తాగ్రేసరులకు చేయూతనొసంగి వీరిచే వ్రాయబడు గ్రంథరాజంబులను వ్యాప్త
మొనరింతురుగాక యనియు భగవంతుఁడగు సర్వేశ్వరుని ప్రార్థించుచుంటిని.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

కవిరాజ పండిత, దంతనాల నాగేశ్వరశాస్త్రి

ఓం

శ్రీ మజ్జరుగు వేంకటగురు పరబ్రహ్మణేనమః.

# ప్రాణలింగశతకము.

సీ॥ శ్రీహైమవతిలోల శివభక్తపరిపాల ♦ కరుణాలవాల శంకరసుశీల
భసితాంగసుందర ప్రణవమంత్రాధార ♦ నిగమాంతసంచార నిర్వికార
ఫణిభూషఫాలాక్ష ప్రమథగణాధ్యక్ష ♦ విమలసజ్జనపక్ష కుమతశిక్ష
జగదేకమోహన సౌందర్యవిగ్రహ ♦ సగుణనిర్గుణరూప సర్వసాక్షి
గీ॥ స్వామినీకంకితమ్ముగా నీమమొప్ప ♦ నీసశతకమ్ము రచియింతు చిత్తగింపు
మఖిలసన్మునిహృదయదరంగాబ్జభృంగ ♦ పరమకరుణాంతరంగ మత్ప్రాణలింగ.

సీ॥ పంచకావ్యంబులా పఠియించి యెరుగను శబ్దశాస్త్రంబన్న జాడ యెరుగ
లక్షణగ్రంథముల్ వీక్షించి యెరుగను ♦ యక్షీణమగు నీకటాక్ష మహిమ
బల్కించె నాచేత పద్యశతంబిట్లు ♦ తప్పులమన్నించి దయదలంచి
చిత్తగింపుమి సదాశివ భక్తవత్సల ♦ కాత్యాయనీలోల గరళకంఠ
గీ॥ ముక్తిదాయక కరుణాసముద్ర భద్ర ♦ భక్తవత్సల శ్రీగురుప్రభువరేణ్య॥యక్షి॥ 2.
సీ॥ పరమయోగీంద్రుడై ధరతత్త్వరూపుడై ♦ వెలసిన వేమనార్యులను గొలుతు
సత్కృత్యలంబున కాదిపూరుషుడైన ♦ బలిసార్వభౌముని బ్రణుతిసేతు
భక్తసి ప్రహ్లాదు బరిహాసింపగజాలు ♦ తంజాపురీ పెద్దదాసు నెంతు
నాదినే సత్యాగ్రహంబును సృష్టించి శ్రీరాముకీర్తికి చిచ్చుబెట్టి
గీ॥ స్నట్టిశంబుక సంయమి నభినుతింతు ♦ భట్టుమూర్తిపదమ్ములస్ బట్టనెంతు ॥నక్షి॥ 3.
సీ॥ భోగాఖిలమ్మును బొందుటకిరవైన ♦ సామ్రాజ్యలక్ష్మిని సరకుగొనక
పతియె దేవుండన్న భావమ్మునందున్న ♦ యర్ధాంగినైనను యాత్మనిడక
ముద్దుముచ్చటలతో మోదమ్ము సమకూర్చు ♦ కన్నకుమారుడం జెన్నబోక

తలిదండ్రి ప్రత్యక్షదైవమ్మనుచు మది ♦ భావించి చిక్కులో బడక నెల్ల
గీ॥ ప్రాణికోటులఁ దుఃఖములఁ బాపనెంచి ♦ భూతదయ గుమ్మరించినబుద్ధుగొల్తు ॥నఖ॥
సీ॥ పదియునేడబ్దాల ప్రాయమ్మునాకుండు ♦ తరినన్నుతనకుతాదరికిజేరి
పంచాక్షరీమంత్రభాగ్యమ్ముమరియును ♦ ఛాయాపురుషయోగ చెలిమిగూర్చి
కరుణించినటువంటి ఘనుడుమహాత్ముండు ♦ తారకదాత సద్ధర్మమూర్తి
రామినేన్యంశాబ్ధి రాకాశశాంకుండు ♦ కోటయార్యుండు సద్గురువరుండు.
గీ॥ ధరన బ్రాంహ్మణకోడూరు పురనివాశి ♦ వారిదయవల్ల నిన్ననువరుసగంటి ॥నఖ॥ 5.
సీ॥ భవశంకరా శివా పార్వతిహృదయేశ ♦ మృత్యుంజయా హరామృడమహేశ
కామాంతకా కాలగర్వాపసంహార ♦ ప్రమథగణేశ సద్భక్తపాల
గంగా జటాజూట లింగాంగసర్వేశ ♦ రాజశేఖరమో రాజరాజ
గజచర్మధర మహాకాలసన్మునిలోల ♦ పతితపావన నామభక్తకామ
గీ॥ యనుచుసంస్తుతి ననుదినంబాచరింప ♦ కరుణవరమిమ్ము నీదుకింకరుడనౌదు ॥నఖ॥
సీ॥ కైలాసనాథా యుగజదైత్యనాశాయ ♦ ఫణిభూషణాయ తుభ్యంనమోస్తు
నీలకంఠాయ హేనిజభక్తవరదాయ ♦ పావకాక్షాయ తుభ్యంనమోస్తు

శశిమకుటాయ శ్రీశర్వాణీలోలాయ ♦ భవనాశనాయ తుభ్యంనమోస్తు
బ్రహ్మాదిసురవంద్య పాదారవిందాయ ♦ భద్రగుణాయ తుభ్యంనమోస్తు.
గీ॥ భావభవశూలపాణి తుభ్యంనమోస్తు ♦ పతితపావన నామతుభ్యంనమోస్తు॥యఘ

సీ॥ శరణుభార్గవిలోల శరణుసన్మునిపాల ♦ శరణుసన్నుతశీల శరణుశరణు
శరణుపావకనేత్ర శరణుదాస సుమిత్ర ♦ శరణుసుందరగాత్ర శరణు శరణు
శరణుపన్నగభూష శరణుమంజులవేష ♦ శరణుసూనృతభాష శరణు శరణు
శరణుమాయాతీత శరణు మామకదాత ♦ శరణుపాలితభూత శరణు శరణు
గీ॥ శరణుమేటిధనుర్ధరా శరణు శరణు ♦ శరణు రజతాద్రినాయకా శరణుశరణు॥నఘ॥

సీ॥ కంబుకంధర పాహి కాలాంతకాపాహి ♦ గంగాధరాపాహి ఘనుడపాహి
విమతఖండనపాహి విశ్వేశ్వరాపాహి ♦ భక్తప్రియాపాహి ప్రభుడపాహి
రామవరదపాహి రక్షకమాంపాహి ♦ శమనభంజనపాహి శంభుపాహి
విశ్వాత్మకాపాహి విశ్వరూపకపాహి ♦ విశ్వదూరగపాహి విభుడపాహి.
గీ॥ పాహిగౌరీమనోహరా పాహిపాహి ♦ పాహి వేంకట గురునాధ పాహిపాహి॥నఘ॥

సీ॥ రక్షవిశ్వేశ మాంరక్ష సురాధ్యక్ష ♦ రక్షభూతాధ్యక్ష రక్ష రక్ష
రక్ష విరూపాక్ష రక్ష సన్నుతదీక్ష ♦ రాజకిరీట మాం రక్ష రక్ష
రక్ష గంగాధరా రక్షరాజేశ్వరా ♦ రజతాద్రినాథ మాం రక్ష రక్ష
యక్షేశసఖరక్ష యక్షీణబలదక్ష ♦ దక్షాధ్వరధ్వంసదక్ష రక్ష
గీ॥ రక్షమునిబాలరక్ష మాం రక్ష రక్ష ♦ రక్ష వేంకటగురునాథ రక్ష రక్ష॥యుఖ॥10

సీ॥ పరులనువంచించు బద్మాక్షుగుంపుల ♦ పాలకంఠంబుల పాశములుగ
మతమొసంగెడిహక్కు మాయించుకోటల ♦ గూల్చు శతఘ్నులగుండ్లనంగ
సత్యమామిముదాచి సాగుదేవతలకు ♦ నిత్యమ్ముబంధించు నిలయములుగ
సుఖముదుఃఖంబట్లు దుఃఖమ్ముసుఖమట్లు ♦ జూపించుతమముకు సూర్యులట్లు
గీ॥ పద్యశతకంబురచియింతు పార్థివేశ ♦ కరుణదీవించుమిద్దీని కంబుకంఠా ॥యుఖ॥11

సీ॥ చెప్పాలదినుకుక్క చెరుకుతీపెరుగని ♦ విధమునతప్పాలే వెదకెనంచు
బల్కుదురొక కొందరుల్కురోగంబుచే ♦ నిజమాడగారాదె నిష్ఠురమ్ము
పోరికికాల్ద్రవ్విబొడ్డుపైమశిరాచు ♦ కొనువారితోడ మార్కొనగబోను

పేడమెక్కెడిక్రిమి బెల్లంబెఱుంగని ♦ గతిమొద్దుకెటు తెల్వఁగల్గునయ్య
గీ॥ స్వామినీకరుణావృష్టి బారినట్టి ♦ వారుకాదనఁబోరు మద్వాక్యములను ॥యఖి॥ 12

సీ॥ మాదిగోఁడని చెప్పు మానిసి యొక్కండు ♦ యే నాది నని పల్కుపూఁటయొకఁడు
మాల నేననునట్టి మానవుం డొక్కండు ♦ యెరుకలోవాఁడ నఁట నరుఁడొకండు
ముదిరాచవాఁడ నఁట మనుకొని యొక్కండు ♦ జంగమనని పల్కుజనుఁడొకండు
దాసరి ననువాఁడు తా రెడ్డి ననువాఁడు ♦ బలిజ నంచొక్కండు భక్తుఁడొకఁడు
గీ॥ యిట్టిశబ్దార్థములను గన్పట్టిచూడ ♦ పగతులీరీతిమార్చిరఁట నగజనిఁచు ॥నఖి॥

సీ॥ ఆదిద్రావిడులయందన్యాయ ముదయింప ♦ నార్యసంఘము చేత నణఁగఁగొట్టి
యార్యులందఱ క్రమం బావిర్భవింపంగ ♦ ముసలుమానులవారిముంచి తేల్చి
తురకవారలు జేయు దుండగంబులగని ♦ మహారాష్ట్రిలతో వారిభారమూడ్చి
యారె మరాటీల చోరత్వములుగాంచి ♦ యింగ్లీసువారిచే యీడ్చివైచి
గీ॥ తన్న యీలాటిపాపమ్ములరశి తుదను ♦ విలయకాలానలజ్వాలి విడతు నార ॥నఖి॥ 14

సీ॥ భూదేవికిక్కట్లు పొసగించిరటవారి ♦ బొలియించుటకు విష్ణుబుట్టెనంట
గొండ్రాలుసూనుండు కొడుకులగనెనంట ♦ యిట్లంచుజెప్పాటల్ పుట్టలంట
పరమపతివ్రతా * పతిగూల్బు కొరకున్నై ♦ శ్రీవిష్ణువామెను జెరిపెనంట
పున్నె మెక్కువయైన బొలియింపదగునంట ♦ వామనుండందుకై వచ్చెనంట
గీ॥ యిట్టికతలను గల్పించినట్టివారి ♦ కెట్టి పాట్లనుగల్పించి పెట్టినావొ ॥యుక్ష॥ 15
సీ॥ పతి 1 శిష్యునొనగూడి సుతుగన్నకామిని ♦ మరదికి సతియైన తరుణి 2 మిన్న
వాలితో రతికేళి నోల 3 లాడినరామ ♦ పంచపతుల్గల యంచ 4 యాన
యింద్రుని బొందిన యిందీవర 5 దళాక్షి ♦ పంచకన్నియలంట పంచవదన
వీరినామంబులు వేడ్కతో స్మరియింప ♦ సర్వపాపంబులున్ సమయునంట 16
గీ॥ చూడుమీ వ్రాతయందలి సూనృతమ్ము ♦ కల్లనిజముల గన్పట్టు ఘనుడవీవె ॥నక్ష॥

---

* సతీతులశని.

(1) బృహస్పతిదారతార (2) వాలియాలితార (3) మండోదరి (4) ద్రౌపది (5) అహల్య.

సీ॥ అర్ధిజనంబుల కాధారమగువాని ♦ ప్రతలంబునకు ద్రొక్కు పాపియొక 1 డు
క్షత్త్రి చేర్తబూని కటికవానివిధాన ♦ కుజనుల సుజనులన్ గూల్చెనొక 2 డు
సత్యమన్ మిషతోడ జనుదెంచి లోకుల ♦ కొంపలన్ గూల్చినకొంటెయొక 3 డు
హరియవతారమ్ములని వ్రాసిపెట్టిరి ♦ మతకసామ్యంబుగా ముష్కరులను

గీ॥ మొరకువారల నవతారమూర్తులంచు, వ్రాశి చెల్లించిరే మందువసుధమీద ॥నఖి॥

సీ॥ అన్నన్న సౌశీల్యమడుగంటజేసిన ♦ సు 4 దతి నేలినయట్టి సుగుణరాశి
పరమేష్టివరమున ప్రభవించినటువంటి ♦ సతి 5 ని రాకాశిగ సలిపినట్టి
కుంభజుమన్నించి కుచ్ఛితమతిబెంచి ♦ తాటకన్ దున్మ టదేటిసతి
మునివేషమనగ వస్త్రములుదాల్చుట యదేటి ♦ తాపసవేషమ్ము దలచిచూడ

గీ॥ గ్రుడ్డివాండ్రేనుగునుముట్టి గోడబోల్ప, కన్నులున్నట్టివార లేకరణినిరొ ॥నఖి॥18

---

(1) వామనుడు లేక, త్రివిక్రముడు (2) పరశురాముడు (3) దశరథరాముడు (4) అహల్య (5) తాటక.

సీ॥ పిండమ్ము తండ్రికి బెట్టునప్పుడు గార ♦ పిండికోవల రేగుబండు బెట్టి
యయ్యనాకాహారమైన దియ్యదె దీని ♦ నారగింపుము ప్రీతిననగ దాను
యపు డహింసావ్రతంబను పాశబద్ధుడై ♦ నటులొప్పికొనిన యట్లగునుగాదె
పక్షీంద్రునకు లేడి పలలపిండము బెట్టు ♦ నపు డహింసావ్రతం బాచరించె
గీ॥ నకట హింసావ్రతంబంత హద్దుమీరి ♦ కడకు నిర్దోషులనుగూడ గాల్చివేసె॥నఖ॥
సీ॥ పరమేశ నిన్నాత్మభావించి తపియించు ♦ సుతునిగూల్చిన మహాశోకమంది
యాశశి దీర్చుకొనదు దెంచినటువంటి ♦ మగువను 1 ఘోరావమానపర్చి
మండలించినవారి మారణంబొనరించి ♦ దీపమ్ములెన్నియో దీయువాని
భార్యనుగొని తెచ్చి పరిభవింపని గుణి ♦ రాక్షసుండంట శ్రీరాముడేమో
గీ॥ దేవుడట వారిగొనముల్ తీరులంట ♦ పక్షపాతంబదియటన్న పాపమంట॥యఖ॥ 20
సీ॥ ఆజ్ఞాతిరస్కార మవనీపతిద్రోహ ♦ మను రెండు నేరమ్ములాచరింప
దయతోడ నవ్వాని దండింపకట్టు ద్రోల ♦ నా ద్రోహితో 2 నేస్త మాచరించి
యన్యాయముగ వాలినంతమ్ము నొందించి ♦ యేలగూల్చితివన్న "తాళవృక్ష

---

(1) శూర్పణఖ (2) సుగ్రీవుడు

మెందుకేతటన్న ఘుందురుగడ్డికన్ ♦ తీరుగా దబ్బరల్ మారుమ్రోగి
గీ॥ నట్టిరాముండు నైకుంఠుడైనరీతి ♦ యప్పకవి 1 జెప్పె సూనృతంబొప్పగాను ।యఖి॥

సీ॥ తమ్మునిసతిగూడు తప్పనిరూపించి ♦ వాలినిగూల్చిన వరుసతోడ
నన్నభార్యన్గూడు యన్యాయమునకునై ♦ సుగ్రీవుజంపని సూటియేమి
భరతునాజ్ఞను జేయుపనివాడనంచని ♦ వాలితోడుత తాను బల్కెనౌర
గద్దియపైనెక్కగా బిల్చెనేగాని ♦ వనభూములకుబోయి వరుసబెట్టి
గీ॥ సాధులనుగొట్టి దుష్టుల చంకబెట్టి ♦ కొంచు రష్మునిబల్కెనాయించుకైన. ॥నఖి॥22

సీ॥ కలిమిగల్గిననారి గాడిదతోగూడ ♦ నదినోము సద్వ్రతంబనుటలేమి
తోనున్నచెలి భర్తతో మాటలాడిన ♦ కంఠూతియందురు ఖలజనములు
ధని యపానవవీడ ధన్యాసిరాగమ్ము ♦ పేదరాగాబెన్న రోదనమ్ము
తప్పనెంచెటివేళ తనసాటిమనుజుండు ♦ వధియించువేళలో వానరుండు
గీ॥ "యిష్టమైన అమేధ్యమ్ము యింగువనెకి" ♦ రీతిగానుండె రామయ్యనీతిజూడ. ॥నఖి.

---

(1) అప్పకవీయములో కవితా మహత్త్వము చూడుము.

సీ॥ శత 1 సంఖ్యతలలున్న శౌర్యధనుండొక్క ♦ డాతనివధియింప నక్రమముగ
నవనిజతోడ రానరిగి శ్రీరాముండు ♦ మూర్ఛిల్లెనారిపుముఖ్యుచేత
జానకి తానంత శక్తిరూపము దాల్చి ♦ తలలన్ని వ్రేటుకే ధరణిగూల్చి
కొన్ని శక్తులగూర్చికొని వానిరక్తమ్ము ♦ పానమ్ముజేయునప్పట్టునందు
గీ॥ భర్తగని మ్రొక్కెనట చెరలబ్బునప్పు ♦ డిట్టిసీతమ్మశక్తి యేగట్టుజేరె ॥నభ॥ 24
సీ॥ వహ్వారె యేతంత్రశ్రీవా శైనో పలనాటి ♦ వీరులచరితమ్ము విసుగులేక
శోడిపందెములోన కొట్లాడు బ్రహ్మన్న ♦ శౌరియేకాదశంపుజన్మ
మదిగాక యాతని యనుగుసూనుడు బాలు ♦ డాలినేలక వెలయాలినేలు
నాతండు ద్వాదశంబైనట్టి తనువంట ♦ భళిభళి తప్పేమి పందిచేప.
గీ॥ కషణుతాబేలు మొదలైనకష్టతనువు ♦ లైనవానుప్పాను మనుజులైరనుట కేమి॥యభి
సీ॥ గౌతముసతిగాంచి కామాగ్నితప్తుడౌ ♦ యింద్రుండు వైరాగ్యమందెనంట
భాగవతోత్తమపథమందు నిలచిన ♦ బలిమోహినిని జూచివలచెనంట

---

(1) రామాయణాద్భుతోత్తర కాండగాధ

పంచిపెట్టినవాడు భక్తవత్సలుడంట ♦ చంద్రసూర్యులు సైగ జేశిరంట
గ్రహణంబదేనంట గన్గొనుమాతంట ♦ గారడీవ్రాతలో కడుపుమంట

గీ॥ న్యాయభాగమ్ము నీకయన్యాయమట్టు ♦ లేటికొనరించుహరి మైనరభూంటగాక ॥యఖి

సీ॥ బలవంతముగ నన్నభార్యను 1 జెరచుట ♦ గురుపత్నితో నొనగూడు టయును 2
మునిసతి 3 నంటుట తనయను 4 బట్టుట ♦ తల్లివావిని 5 పార దరుముటయును
వెనుదన్ని 6 పుట్టిన వెలదిని పెండ్లాట ♦ గురుమూర్తి 7 తలలూడ గొట్టుటయును
తనకన్నపెద్దదా తరుణిని 8 పెండ్లాట ♦ పదుగురు 9 నొకసతిన్బట్టుటయును

గీ॥ సత్తెకాలంపుకతలంట కృత్తివాస ♦ కూడదనుటలు కలికాలకూతలంట ॥యఖి27

(1) బృహస్పతి మమతను (2) చంద్రుడు తారతో (3) యింద్రుడహల్యను (4) బ్రహ్మ సరస్వతిని (5) యముడు కుంతితోగూడుటయు (6) యజ్ఞుడు దక్షిణను (7) యింద్రుడు విశ్వరూపాచార్యులను (8) బలరాముడు రేవతిని (9) గౌతముని సుతయగు జటిలకు పదుగురుపతులు.

సీ॥ భూతహితార్థమై చేతులారగ మేని ♦ పలలంబొసంగిన ప్రభువటుండ
పరహితార్థంబుగా పాంచభౌతికమైన ♦ తనువొసంగిన తపోధన్యుడుండ
ధర్మహితార్థమై తనదుసర్వస్వమ్ము ♦ ధారవోసినయట్టి ధీరుడుండ
నర్థిహితార్థమై యర్థమేసదరిగించు ♦ కొనినటువంటి సద్ఘనుడటుండ
గీ॥ కరకుకత్తుల గొంతులుదరుగువారి ♦ నారహరి యవతారమ్ములనుచు వ్రాసి॥రఖి॥

సీ॥ పితృభక్తి వ్రతుడు బీష్ముడ నెడిపల్కు ♦ మహి నెల్లెడలనిండి మారుమ్రోగ
జనకునితమ్ముండు జనకసమానుండు ♦ జాయాసుతులతోడ చెంతనుండ
దేవరన్యాయ మేతీరుసహించెనో ♦ భక్తివ్రతంబెందు పాడువడెనో
తాతరక్తముగాదె తండ్రిపింతండ్రియున్ ♦ వంశాంతమనుపల్కు వాడనేల
గీ॥ భర్తృహరినీతితో బోల్చిపారజూడు ♦ దేవవ్రతుశీలమును యేలదెగడరాదొ॥య

సీ॥ తమ్ముండుగల్గిన తనకుచేటని తల్లి ♦ గర్భస్థపిండమ్ము గత్తిరించి
మునిసతినొనగూడి తనువెల్ల యోనులై ♦ బ్రహ్మహత్యదోషమున్ ఫలముబొంది
కామ్మకై కపటవేషమ్ముల దాలిచి ♦ సగరుయాగహయమ్ము సంగ్రహించి

మహానలనిష్ఠలన్‌మాడ్చి భస్మముజేయు ♦ దండులంజలకు కైదండలిచ్చి
గీ॥ నట్టివానికినై బలిన్‌గట్టివైచి ♦ నట్టియాతండు శ్రీమహాయిట్టువంట ॥యు॥ 30
సీ॥ ధర్మసంస్థాపనా తత్పరత్వముబూని ♦ శౌరిజన్మించు భూచక్రమందు
ననిపల్కువచనమ్ము లనృతమ్ముగాదోచె ♦ ననృతమ్ముగాకున్న (నాహ1వమున)
నీతిదూరంబైనచేతలు జేయునా ♦ శౌరియే తానైన సిగ్గుమాలి
దుష్పథగాములీ దుర్ణయంబులనెల్ల ♦ శౌరిమెడన్‌గట్టి చెప్పినారు
గీ॥ కల్లయవతారములకతల్ గట్టిపెట్టి ♦ బుద్ధితోనిన్ను సేవింప బూర్ణుడౌను ॥యు॥
సీ॥ తల్పదేవత బ్రహ్మ తావునకరుదెంచి ♦ మత్కుణాసురులు నామావశిష్టు
లెందాక గారో నాకందాక భారమే ♦ ననివేడ విధియది హరికిదెల్ప
హరినరుడైపుట్టి యాదైత్యవరులెల్ల ♦ తననుకుట్టిరటన్న తప్పుజూపి
యవ్వారిహరియించి యాతల్పదేవతా ♦ భారమ్మునంతయు బారద్రోలె.
గీ॥ ననెడిగతిగాదెజూడ రామాయణమ్ము ♦ గోపసూనుని చరితమ్ముగూడజూడ॥నఖి॥
సీ॥ వైకుంఠమందిరావాసులౌ వారికే ♦ గతిలేకపోయె మాకత్తిముందు
ద్రవిడదేశాధీశుడైనట్టి వానికే ♦ గతిలేకపోయె మాకత్తిముందు

క్షితినాథుడౌ పరీక్షిత్తు కదేకీతి ♦ గతిలేకపోయె మాకర్తిముందు
పటుదానశీలుడౌ బలిచక్రవర్తికే ♦ గతిలేకపోయె మాకర్తిముందు
గీ॥ భద్రమని బ్రాహ్మణేతరుల్ భయముజెంద ♦ వ్రాసియుంచిరి శ్రీభాగవతముభళిర ॥న

సీ॥ బ్రహ్మాండకోట్లు గర్భమ్ములోధరియించు ♦ శ్రీహరికొకకొంప జెప్పనగునె
తన్నుతానెరుగని ద్రవిడదేశాధీశు ♦ నపరాధియనిచెప్ప ననువుపడునె
కలి నిగ్రహమ్మునుగావించు నలపరీ ♦ క్షిత్తుదూరంగ నోరెత్తనగునె
పాపివాసవుద్రోలు బలిసార్వభౌముని ♦ హంతవ్యుడనికూయ ననువుపడునె
గీ॥ పరులయిస్తువు లపహరింపంగనిట్టి ♦ దొంగవ్రాతలువ్రాశిరౌ తొల్లిఖలులు ॥న॥

సీ॥ పరమేశ నీస్వరూపంబుజూపెడిశ్రుతుల్ ♦ చెరసాలలంగున జేరెనయ్య
కల్లపురాణముల్ కొల్లలయ్యెను వత్స ♦ పాతంపుశాస్త్రముల్ ప్రబలెనయ్య
సకలేశనినుజూపు జాడలసరికట్టె ♦ వికటంపు శాస్త్రముల్ వెలసెనయ్య
సత్యవాక్యమ్ములు జనవిరుద్ధంబయ్యె ♦ నసృతమ్ము జనులకానందమయ్యె
గీ॥ కటకటాలోకమిటుల చీకాకుపడగ ♦ జూచుచుంటివె యీయెల్లచోద్యములను

పాత్రుఁడైనను పారుండుపూజ్యుండు ◆ పుణ్యాత్ముడైనను పుడమిలోన
1 సూతుఁడపూజ్యుఁడారీతి యెట్లన్నచో ◆ పోల్గావునకు ద్విజుంబోల్చిసూతుఁ
గాడిదగతియంచు యేడిచెనొకయయ్య ◆ దుష్టుఁడో గాడిదశిష్టజనుఁడొ
గాకున్న నీలాటి గౌరవంబెరుగని ◆ కూతవ్రాశినవాఁడొ నీతిమాలి
గీ॥ చేతికనువగురీతుల బూతులెల్ల ◆ వ్రాశిపెట్టిరిరాతండ్రి వసుధనిండ ॥నఖ॥ 34

సీ॥ ధర్మశాస్త్రమ్మను రథమెక్కి వేదమస్ ◆ ఖడ్గమ్ము ధరియింపగల్గినట్టి
2 పారుడేయగతాళిబల్కెనా యయ్యది ◆ స్మృతియేనటంటయాకతసువినుము
నయమపానముగూడ నాయమాస్మృతియంచు ◆ వ్రాయలేదదియేమొవ్రాశిరేమొ
తల్లిచెవులుగోయు ధన్యాత్మునకు పిన్న ◆ తల్లిచెవులు బీరతరుసుమములె.
గీ॥ యుత్తనేలిన ముత్తవ్వయానగనెంత ◆ కేశమాత్రమ్మునుంగాదు లేశమైన ॥నఖ॥ 35

---

(1) శ్లో॥ దుశ్శీలోపిద్విజః పూజ్యనతు శూద్రోజితేంద్రియః॥ పరిత్యజ్యగాం దుష్టాందు హేత్క్షీరవతీమ్ ఖరీమ్॥ (2) ధర్మశాస్త్రరథారూఢో అను శ్లోకము

సీ॥ సూతుఁడెవ్వాఁడైన ఖ్యాతిగావిత్తమ్ము ♦ గూర్చియుంచగరాదు కువలయమున
1 గూర్చియుంచినదాని కువలయేశుండెత్తి ♦ పారునకొసగుటే బాడియంట
కష్టించిశూద్రుండు కాసునార్జించిన ♦ దానికివారసు ధరణి సురుఁడు
గావ్రాశినటువంటి కపటంపుశ్లోకముల్ ♦ దర్మశాస్త్రములంట ధవళదేహ
గీ॥ వాసి నెత్తుకమాపైనిబూని కపటు ♦ లకటవ్యాశ్రదూచారమంచువచ్చె ॥నఖ॥ 36

సీ॥2 కృషియువాణిజ్యమ్ము పశుపాలనాదులు ♦ వైశ్యవృత్తులటంచువప్పగించి
విప్రదాస్యమ్మును విడనాడి శూద్రుడే ♦ వృత్తినోనర్చినా రిత్తయంచు
బల్కియావెంటనే పాల్నెయ్యిదధిచల్ల ♦ లమ్మంగవచ్చునంచానతిచ్చె
కొనవచ్చుననలేదు గోపాలనమ్ములే ♦ దెట్లువచ్చునటంచు యెంచినాడొ
గీ॥ యెరుగుమయ్య పరాశరస్మృతివిధమ్ము ♦ వ్రాకజేసుకొవలె నింకతోకబెట్టి ॥నఖ॥

---

(1) యిదియును పరాశరములోనిదేగాని శ్లోకము గ్రస్తిలేదు. (2) ఇటూ పరాశరస్మృతిలోజూచిన విశదమౌను.

సీ॥ కృష్ణగోక్షీరముల్ గ్రోలి నావేదమ్ము ♦ పఠియించి నాతోనె పతితుడౌను
వెంటనే యింకొక్క కుటిలవాక్యంబొందు ♦ బ్రాహ్మణ స్త్రీగూడ పాపపుబ్బ
ననగనన్య స్త్రీల నొనగూడవచ్చునం ♦ చానతిచ్చుటగాదె యరయుమయ్య
యెవరెటుపోవ నే మిటుమళ్ళి పండకొమ్ము ♦ న్నట్టులున్నదీయార్యవల్కు
గీ॥ సూతజాతులపైనున్న సూడుదీర ♦ వాతనేసిన రీతిగా వ్రాసెనౌర ॥యు॥

సీ॥ 2 గతిలేని పారుండు కాలధర్మమునొంద ♦ నాశవమ్మును మోసి యగ్ని జేర్ప
నడుగునకొక యజ్ఞమాచరించినయట్టి ♦ ఫలముగల్గునటంచు నుడివియంత
శూద్రప్రేతము కండ్ల జూచెనా పారుండు ♦ మూడురోజులువాని ముట్టరాదు
యావెన్క నాతని యబ్ధిసంగమమైన ♦ వాగుంగోపలముంచి వందసార్లు
గీ॥ ప్రాణాయామములును ఘృతప్రాశనమ్ము ♦ గూడ చేయింపవలెనంట చూడుమయ్య.

సీ॥ 3 పరతంత్రకష్టముల్ బడలేక విసుగొంది ♦ సూతుడయ్యెదవీడి సుఖముగోరి
యమితమౌలాభమ్ము నార్జించునటువంటి ♦ శిల్పవాణిజ్యాది శిష్టవృత్తు

---

(1) (2) (3) యివియును పరాశరములోనివే.

లాచరించిన శూద్రు లల్పాయువులతో న ♦ శించిబల్ నరకమ్ము జెందునంట
సుఖపడరాదంట సూతుండునీసేవ ♦ కాశింపరాదంట వీసమైన
గీ॥ భళిపరాశరముని నాధుపల్కులంట ♦ గ్రాంహ్యమని ప్రాజ్ఞులగువారుగాంచనగున.

సీ॥ 4 సకలేశశూద్రులు చదువంగరాదుసీ ♦ భజనసేయుట కసల్ పనికిరాదు
ద్విజసేవలకుదక్క దేనికితగరందు ♦ తాకుటకైన తగరువిప్ర
డెద్దివచించినా నెదురాడగారాదు ♦ కొట్టితిట్టిన యెదుర్కొనగరాదు
పారుడైపుట్టియేపాడు వృత్తులనున్న ♦ వంగిమ్రొక్కుచు నుండవలయుగాని
గీ॥ మందలించుటగూడ దేమానియైన ♦ విప్రరించోళిజన్ములివ్విధమునుండె.

సీ॥ వేతనంబులకునై విగ్రహపూజలు ♦ నసతిప్రాయశ్చిత్తమాచరించు
కొనసంఘమున జేర్పు కొనుటయుగోపాన ♦ శేషమాచమనమ్ము జేయుటన్య
కులవృత్తులకు విప్రులలవాటుబడుటలు ♦ బహుకాలనైష్ఠిక బ్రహ్మచర్య
తలిదండ్రితోడుల తనయులపెండ్లిండ్లు ♦ సన్యాసమును గూడజరుపరాదు
గీ॥ కలినినిర్ణయసింధువీగతిని దెల్పు ♦ చట్టములవీడిమాపంథబట్టిరయ్య॥యఖి॥

---

(4) యివియును పరాశరములోనివే., (5) నిర్ణయసింధువు

సీ॥ తమవలెనరదేహధారియా మనుజుఁడు ♦ తమకంటె కులమున తక్కువంట
తా మెట్టిపతితులై దనరుచుండినగాని ♦ నీవువారికి మూలనిధివేనంట
యందుచేమా దైవమవ్వారలేనంట ♦ తమసేవమాకు ముక్తిదాయులంట
కావన్న చో మాకు కాలునిపురియంట ♦ చూడు మెట్టిభయమ్ము జూపినారొ
గీ॥ నౌర యీయింద్రజాలమ్ము లణగకున్న ♦ మాకు తెరవేది నీదయామహిమ మేది॥ నఖి॥

సీ॥ వేదంబులెల్లర కాదేశములు వాని ♦ నాక్రమించిన దైత్యు నణచినట్టి
హరినేటికుటిలుల నణచివేయగలేదు ♦ గానవాయవతార కతలు కల్ల
గాకున్న హరిభీతిగల్లదా వీరికి ♦ లేదు లేదా భీతి లేశమైన
పరులకుబోధించు పట్టున హరిభీతి ♦ స్వాంతంబునందు నావంత లేదు
గీ॥ బ్రహ్మరాక్షసుడన కూళ బాపనయ్య ♦ గాక వేరొకడున్నాడ కలియుగాన ॥లఖి॥

సీ॥ జన్నంబులనియును సంతర్పణములని ♦ గుడిగోపురములని కుంటలకని
దేశంబుపై బయల్ దేరి సంసారుల ♦ పీడించి ద్రవ్యంబు కూడబెట్టి
జట్టీలవలెనున్న జన్నిగట్టులకెల్ల ♦ పొట్టలుబగులగా బెట్టువార

లన్నమో రామచంద్రాయంచు పిలపించు ♦ మాలమాదిగలనే మాటవిన్న

గీ॥ దవిలికరచునువారల ద్రాచుబాము ♦ లౌర కులమనివెుశీ మాఱిమూగడములు.

సీ॥ జాయగతించిన శతవృద్ధుకైనను ♦ వైవాహికము సేయ వచ్చునంట
గర్భరజస్వలేగానట్టి నిసువైన ♦ పతికిల్ల పెండ్లాండ్ల పాపమంట
సతిసహగమనమ్ము సల్పంగవలెనంట ♦ పతికిలేదంట యాపాడుతంట
భర్తసేవయెదక్క పరమేశనిన్నైన ♦ స్మరియింపరాదంట స్వాంతమందు

గీ॥ యిట్టిచట్టంబులనుబెట్టి నట్టివెల్ల ♦ ధర్మశాస్త్రమ్ములట వాటితగులబెట్టు॥ యశ॥ 46

సీ॥ ఉపనిషత్తులనెల్లనూక్చి పెంటలబోసి ♦ పక్షపాతమ్ములేర్పరచి వ్రాశి
శ్రుతిధర్మములమాంపి స్మృతిధర్మములజూపి ♦ తికృపురాణముల్ కూర్కి రయ్య
కల్పనాకథలవిగాలించి గన్గొన్న ♦ ధర్మంబనెడిమాట దలపరాదు
యేరీతివ్రాశిరో నేమంచునెంచిరో ♦ చేసిరెట్లాడెనో జెప్పలేను

గీ॥ భూతదయమాలినట్టి దుర్నీతిమాయ ♦ లెట్టినరకంబునొందిరో యెఱుగదరము॥ యశ॥

సీ॥ తోకలోనొక్కండు 1 పీకెలోనొక్కండు 2 ♦ భుజములందొక్కండు 3 బుట్టెనంట
కుండలోనొక్కండు 4 బండలోనొక్కండు 5 ♦ వీపునందొక్కండు 6 వెలసెనంట
నీళ్ళయందొక్కండు 7 నిప్పులందొక్కండు 8 ♦ తొడగుండనొక్కడు 9 దూకెనంట
కుక్కకొక్కండును 10 గుఱ్ఱము కొక్కండు 11 ♦ గాడిదకొక్కండు 12 గలిగెనంట

గీ॥ యిట్టిపుట్టుకలన్నిమ్ము లెట్టులయ్యె ♦ దొంగవ్రాతలు నే వాటితొంగిచూడ॥నఖ॥48

సీ॥ గట్టునకొక్కతె 13 మట్టిలోనొక్కతె 14 ♦ తొడనుండియొక్కతె 15 బొడమెనంట
నగ్నిహోత్రమునుండి యావతారమొక్కతె 16 ♦ కాలియందొక్కతె 17 గలిగెనంట
కన్నుల ముక్కుల కాళ్ళ కర్ణంబుల ♦ కుండల కొండల గుండములను

---

(1) వాలి. (2) సుగ్రీవుడు. (3) పృధుచక్రవర్తి. (4) అగస్త్యుడు. (5) వీరభద్రుడు. (6) వేనుడు. (7) భీష్ముడు. (8) దృష్టద్యుమ్నుడు. (9) వైశ్యుడు. (10) శౌనకుడు. (11) అశ్వద్థామ. (12) గార్గేయుడు. (13) పార్వతి. (14) సీత. (15) ఊర్వశి. (16) ద్రౌపది. (17) గంగ.

మనుజులుబుట్టునా మాయప్రాతలుగాక ♦ ప్రాజ్ఞజనంబులాపథముగనరు
గీ॥ సత్యనియనితిపూర్తిగాజంపివైచి ♦ దొంగప్రాతలు వ్రాశిరాతొల్లిఖలులు॥యాఖ॥

సీ॥ శశియును ధన్వంత్రి క్షీరసాగరమందు ♦ జన్మించినారని జెప్పియొకట
నత్రిపుత్రుడు చంద్రుడాచంద్రవంశమ్ము ♦ వాడు ధన్వంత్రీయన్ యేదుపొకట
వనజసంభవుమేనివలన గల్గిరి నాల్గు ♦ జాతులువారంచు జెప్పియొకట
హద్దుమీరినవారి నాంతులోపలబెట్ట ♦ వరిలెజాతులన్ వచనమొకట
గీ॥ యేదియిందు నిజంబనియేర్తుమయ్యా ♦ కల్లబొల్లులుమితిమీరి కొల్లలయ్యె ॥సఖ॥

సీ॥ కలలోవరించినకాంతు డల్పాయుష్యవంతు ♦ డంచెరగియు పంతమూని
యతనినే పెండ్లాడి వెతలన్నిటికోర్చి ♦ కాలునిమెప్పించి కాంతునకును
యుత్తమామలకును నలతలితండ్రుల ♦ కసువులక్షులు సూనులమరజేసి
సామ్రాజ్యభోగముల్ సహగనార్జించిన ♦ సావిత్రిసాధ్వియే సత్యముగను
గీ॥ సత్యవత్యాదులనుగూడ సాధ్వులంచు♦వ్రాశియుంచిరదే మంచివరుసతోనొ॥యాఖ

సీ॥ ధర్మసూక్ష్మములంట ధర్మని యుత్తరువంట ♦ విటకానివరమంట వినులంట
యోనులందులనుండి సూనునిగ నెనంట ♦ కన్యాత్వమున కెగ్గు గల్గదంట
పాపపుణ్యమ్ములపాలించు ప్రభువంట ♦ తండ్రిగూడినదాని దవిదెనంట
వాని గల్గినవాడు ధర్మజుడంట ♦ గురువధకనంతి యున్న గూడునంట

గీ॥ కుంతిసావిత్రియొకట నాటకునంట ♦ ధరిచిత్రాంగి జేసిన పాపమే మొః॥యఖి॥ ౮:

సీ॥ ధర్మయుగంబుల తెలిసంగులకుముందు ♦ తనయులీగ్గరటంచు దాశరథికో
బల్కెవశిష్టుండు బలేమంచిమాటయే ♦ తనసుతుల్ నూర్గురు తనదుముందె
విలయంబునొందిన విధముకు కారణం ♦ భేష్మా్రదుతపముచే నిల్గినారో
యెంతకుము న్నెందరాకతిజచ్చిరి ♦ ముదిలేతచూడను మ్యాత్మ్యవరయా

గీ॥ గా వివేకహీనుల కనులుగప్పు ♦ గా లిఖించిన నారశికతలుగావే ॥యఖి॥ ౫౫

సీ॥ సన్మార్గులగుకవుల్ సత్యమ్మునందంచు ♦ పాదుల్చినవేమిఫలముగద్దు
విమకలితాన్నంబు విధమునవయ్యాది ♦ గ్రాహ్యంబుగాకుండె కాలకంత
వర్ణాశమాచార గ్రీతమనుపేర ♦ వరులకొంపలుద్రవ్వి పాడుజెట్టు

స్మృతులంట యువ్వానిచెప్పచోద్యము పక్ష ♦ పాతంబులటుజూడు ఫాలనేత్ర

గీ॥ సమరసంబున నటులైన సమయునేమొ ♦ సేదదేరుదుమయ్య మాబాధదప్పు॥నఖ॥

సీ॥ అయికమత్యంబనే యార్భాటమొకవంక ♦ తిక్కజాతులగోలలొక్కవంక
సత్యాగ్రహవ్రతము సాగించుటొకవంక ♦ యెక్కుడేమనుసీల్గు లొక్కవంక
భోగత్యాగమ్మును బోధించుటొకవంక ♦ వక్కలాకులదొంగ లొక్కవంక
నిక్కమేబల్కుటల్ నేర్పుటలొకవంక ♦ టక్కుకూతలబోధ లొక్కవంక

గీ॥ పాలు నీళ్ళను గలిపిన పగిదిగాక ♦ నీరుతైలమ్ముగలిపిన తీరుదోచె ॥నఖ॥ 55

సీ॥ కరకుతురకలంచు కరుణదూరగులంచు ♦ పలలభక్షకులంచు పాపులంచు
మాలనంటినసీట మయిలబోవునటంచు ♦ తురకముట్టినవరకు నరుకమంచు
దెలిపెడివారల తెలివికాశ్చర్యమ్ము ♦ మాలని గని దవ్వుద్రోలువాడె
సాహెబుగానైన సరసకురానిచ్చి ♦ సకలమర్యాదలున్ సల్పుచెప్పి

గీ॥ నటులసేయరు హిందువుల్ కుటిలమతిని ♦ చెప్పనదివారిమతములో చేతగలదు.

సీ॥ మాలమాదిగలైన మాష్టీనివాఁడైన ♦ నేహీనకులుఁడైన నెవ్వఁడైన
ఖల్మాయనెడివారి ఘనమంత్రమునుజెప్పి ♦ పాత్రునవానికి బోనమిచ్చు
సాహేబనుచుబిల్చు సాటివానిగఁదేల్చు ♦ సుప్రయోజకుఁడైన సుదతిఁగూర్చు
నప్రయోజకుఁడైన నాదరించునెకాని ♦ యాంత్రలోపలబెట్టి యణఁగఁగొట్టి
గీ॥ జన్మశతములకైనను చేవరానిరీతి ♦ మార్చరుగదవారినీతిజూడు ॥మఖ॥

సీ॥ దేశంబునందున్న దాసులఁదిలకించి ♦ జాతిభేదంబుల జాడలరసి
మతభేదములఁగల్గు వెతలనన్నిటిజూచి ♦ యారీతినే స్మృతు లమరఁగాంచి
యిచటనేర్చెఁగాని యింగ్లీషువారలు ♦ స్వయముగావారేమి చేయలేదు
యిప్పటికైన నాతప్పునుసవరించి ♦ కొనియెల్లజాతుల కూడదీసి
గీ॥ కొనకు మూర్ఖత నేమనుకొనగవచ్చు ♦ నీతిదూరగులగు వారిచేతలివ్వి ॥యఖ॥

సీ॥ అధికారమున్ననా డాయుధమ్మునుజూపి ♦ కపటంపుశాస్త్రమ్ము లిపుడుచూపి
యయ్యమాస్వాతంత్ర్య మపహరించినవారి ♦ కైకమత్యమ్ము నేడవసరమ్ము
గానియదేరీతి గల్గునో తెలియదు ♦ జాతిభేదమ్ము లాసమయరాదు
కడకుమాపైనున్న కఠినచట్టములన్ని ♦ యాచంద్రతారార్క మగుచునుండ
గీ॥ వలయునికనెట్లు లొనఁగూడవచ్చుతండ్రి ♦ మాటలకుతల్లి కూటిలోమారుతల్లి

సీ॥ కులభేదములుగల్గు పలుదౌష్ట్యములుబోయి ♦ కులములన్నియు నేకకులముగాఁగ
మతభేదముల సూడుమాని దేశజులెల్ల ♦ పరమేశ త్వద్దాసపటలిగాఁగ
బలయుతుల్ దుర్బలుల్ బహాటముగనొక్క ♦ నాయమేగన్గొని హాయిజెంద
భూతదయాది సద్బుద్ధులతో నెల్ల ♦ మానవుల్ కట్టుగా మనెడివేళ
గీ॥ నవుడు స్వారాజ్యమనునది యబ్బునట్లు ♦ కరుణదయసేయు మందాకకడగద్రోలు॥
సీ॥ ఆత్మవత్సర్వ భూతానియనెడిపల్కు ♦ పరులకుబోధించు పట్టులందు
పెరమానధనములే తెరగులాగుదుమనే ♦ గుట్టులవ్వారల పొట్టలందు
సర్వమ్ముబ్రహ్మమన్ జాడబొక్కులయందు ♦ యెక్కుడేమను నీల్గుడొక్కలందు
ధర్మసత్యమ్ములా తాలుకూతలయందు ♦ భీతిగల్గించుటల్ చేతలందు
గీ॥ సాంబయీలాటివారితో సఖ్యమేల ♦ నీవెరుంగనిదున్నదా నిఖిలమందు॥
సీ॥ ద్రావిడార్యులు తొల్లిధరణికై పోరాడ ♦ కుటిలురై యార్యులన్ కులమువారు
ధర్మబాహిరమైన దారులన్నిటబడి ♦ జయపురంబెల్లెట్లొ జేరిరాజ్య
మా నాక్రమించి యమానుషకృత్యమ్ము ♦ లొనరించిశత్రుల ఘనతఁదుంచి
క్షుద్రులంచనిముందు శూద్రులంచనివెన్క ♦ పేరులుపెట్టి యాక్రూరులిట్టు
గీ బెట్టియుంతట విడువకపట్టివ్రాసి ♦ రకటసిగ్గయచిత్తులై విటశ్వ్రాత॥లక్ష॥

సీ॥ బీదసాదల నెల్ల వేధించుపనియాడ ♦ బాయక గుదుచు తత్ఫలములాడ
భక్తులనవమాన పరచిదూరుటలేడ ♦ నార్తులై కడుశోక మంచుటాడ
దొంగభక్తి నటించి దోచికొనుటలేడ ♦ కోతలపాల్బడి కుందుటాడ
పరకాంతలనుబల్మి భంగపరచుటలేడ ♦ యతిపవిత్రవన సౌఖ్య మందుటాడ
గీ॥ వట్టినిందల నైజెట్టి వదరుటేడ ♦ మొట్టికొర్రుల దిగవేయు మొరగుటాడ॥యు॥
సీ॥ యిల్లాలు గంజికై యల్లాడుచుండంగ ♦ కులటాంగనా పాలుగ్రోలుచుండె
పేదలదయబెంచు సాధురిక్తుండయ్యె ♦ కడులోభిఘనుడయ్యె కాలకంఠ
కొండెపుజ్యుండయ్యె కోపిదుడడుగంటె ♦ న్యాయమన్యాయమై యలరుచుండె
మహిమంబుచదరెక్కె. మాన్యునిచెడనాడె ♦ తిమ్మిబమ్మిగమారె దివ్వెలారె
గీ॥ నారసీమహిమంబెన్న నలవిగాదు ♦ కొండబెండయ్యె మరిబెండుకొండయయ్యె
సీ॥ పదిమంది లక్షాధిపతులను దోచినా ♦ యొకలక్షగల సానియొకతెలేదు
ప్రైవేటుగానుండి పదియూళ్ళదోచినా ♦ భాగ్యవంతుండొక్కపక్షి లేదు
దారిదోపిళ్ళెన్ని సారులుచేసినా ♦ వెనకేసి బాగైన విధవలేదు
గురువులై దేశముల్ దిరిగిదోచినగాని ♦ మరుపూటకున్నట్టి నరుడులేడు
గీ॥ జూచుచుండియు నీలాటిచోద్యములను ♦ మానజాలరుగద తృష్ణమహిమగాదె

సీ॥ పిచ్చివాఁడౌఁగాక వెంకివాఁడౌఁగాక ♦ దున్నయౌఁగాక శ్రీ యున్నఁజాలు
కష్టాత్ముఁడౌఁగాక దుష్టాత్ముఁడౌఁగాక ♦ గాసిఁబైనను కల్మిగల్గఁజాలు
జూదరియౌఁగాక సోమరియౌఁగాక ♦ వెధవయౌఁగాక రోవెలయుఁజాలు
కుష్టువాఁడౌఁగాక కుంటివాఁడౌఁగాక ♦ కోతియైనను లచ్చిగూడఁజాలు
గీ॥ భాగ్యముండినచో వేశివానికైన ♦ కన్నెనిచ్చెద రిదియేమికర్మమయ్యా ॥యఖ॥ ॥
సీ॥ ధర్మరావడితండ్రి నిర్మించుచుండంగ ♦ కొడుకు లంజకు మేడగూర్చుచుండె
జనకుఁడారామమ్ము ఘనముగావేయింప ♦ సుతుడుదారులుగొట్టుకూరుఁడయ్యె
బాబుదేవునిభక్తిఁ పరవశుండైయుండ ♦ తనయుండుమదిరమ్ముఁద్రావుచుండె
సబ్బసాధుల సేవలాచరింపుచునుండ ♦ కొమరుండుదొమ్మరి గుడిసెనుండె
గీ॥ నౌరభళిభళి విపరీతమావహిల్లె ♦ జూచుచున్నావ యీలాటిచోద్యములను॥యఖ
సీ॥ గురుపుత్రునకు నిల్వగుడిసెయైనను లేదు ♦ మేదినిఖలునకో మేడగద్దె
కడులోభివానికా కల్మిచేకూరెను ♦ దారిద్ర్యదశ లెల్లదాతకబ్బె
పాపాత్మసఖునకా ప్రాతినిధ్యంబబ్బె ♦ నభిమానధని నైచ్యమనుభవించె
చాడిగొండికినేయి శాల్యన్నమోఁనగూడె ♦ రాగిసంకటిని విరాగిమెక్కె
గీ॥ కడకుచూడగ నరులకు కసవుబెట్టి ♦ కూడుమృగపశువుల కొనగూర్చె దేమొ॥య॥

సీ॥ పరమాత్మనీలోన బ్రకృతియాదినిగల్గి ♦ త్రిగుణంబులతో మాయ తేజరిల్లి
భూతపంకమును బుట్టించియీచరా ♦ చరములునిర్మించి జగము బెంచి
నీసడలేమిచే నిష్ఫలంబగుటకు ♦ చింతింపనీసడ జేర్చిసర్వ
సాక్షిగానుండియు సర్వంబునీవెయై ♦ యున్ననీమహిమల నెన్నదరమె
గీ॥ సగుణనిర్గుణరూప నీసాటినీవె ♦ గాకచూపింపు మొక్కని గలిగియున్న ॥న॥

సీ॥ ఎవరయామీరలు ఏలింగబలిజను ♦ నేపూరయామీది? యెల్లమంద
యింటిపేరేమి ! యాగంటివారందురు ♦ తమనామధేయమ్మ ? శివుడటంద్రు
కోటీశ్వరుండంద్రు కోటయ్యయందురు ♦ కోటప్పయందురు కోవిదాళి
యాత్మగౌరవమన్న నణువైననెఱుగని ♦ నరులకునీనీతి గఱుపరాదె
గీ॥ చెప్పుతోగొట్టి పంపువెంకప్పయేల ♦ జెప్పకుండెనటన్న నేజెప్పలేను॥నమ॥

సీ॥ మనుసంతతౌటచే మనుజులమనిచెప్పి ♦ మాలనిగనిదప్పు దోలువారి
సర్వమ్ముబ్రహ్మమన్ జాడబోధింపుచు ♦ నెమ్మతగ్గులజాడ లెన్నువారి
పైదాహుయాహామే పైగంబరాదమ్ము ♦ యనిపల్కి కాఫరాయనెడివారి
నొకచెంపగొట్ట వేరొకచెంపజూపింపు ♦ మనిచెప్పి సహరమ్ము కంపువారి
గీ॥ జూడస్వార్థప్రియత్వమ్ము జాడలిట్టు ♦ లుండుగాబోలు ననిదోచుచుండెనయ్య ॥య॥

సీ॥ డొంకలానదులయ్యె త్రోవలాముండ్లయ్యె ♦ చెరువులాదిబ్బలై చేనులయ్యె
భావులాపాడయ్యె ప్రభులుతస్కరులైరి ♦ దాతలో కాలుని దూతలైరి
పుణ్యస్థలంబులా పణ్యవాటికలయ్యె ♦ గజములెల్లను మాలకాకులయ్యె
నాత్మస్తవంబులా యంతటమెండయ్యె ♦ పరనింద దేశ సంభరితమయ్యె
గీ॥ ధర్మమార్గమ్ములడుగంటి దుర్మదాంధ ♦ తమములెల్లడ వ్యాపించెధవళదేహ ॥య॥

సీ॥ కరకంఠలోకోప కారార్థమెబుధుల్ ♦ పీఠమ్ములొక కొన్ని బెట్టియుందు
భూతదయాది సద్బుద్ధిమంతులజేర్చి ♦ యధికారమిచ్చెనవాదియందు
రానురానాపీఠ రాజమ్ములీనాడు ♦ కుక్షింభరతనొప్పు కూళజనుల
కాశ్రయంబైయుండు టవలోకనముజేసి ♦ తామదేరీతిగా ధనముగూడ్చ
గీ॥ కాంక్షమీయిదేశమంతట కల్లపీఠ ♦ జాలముద్భవమయ్యెనో శమనశమన ॥ య ॥

సీ॥ గడ్డమ్ముబెంచుక ఘనయోగిననియుబ్బి ♦ తబ్బిబ్బులన్గాయుధగిడీయొకడు
తారతమ్యముమీరి ధన్యాత్ములౌవారి ♦ కారుకూతలుగూయు కర్ముడొకడు
కల్లులొట్టుమద్రావి కై పెక్కునంతట ♦ వీధులదొర్లాడు విధవయొకడు
గంజాయిచెడత్రాగి కన్నుమీదికిద్రిప్పి ♦ చూడుగొదేవుండనే యధముడొకడు
గీ॥ ధరణిలోపలనీనత్ద్రష్టలెల్ల ♦ దేసికస్వాములై బయల్ దేరిరయ్య ॥య॥

సీ॥ దయసత్యశౌచముల్ దవ్వయినచో మోక్ష ♦ పదములేదను బుద్ధభక్తుఁడొకట
యేసునాథునినమ్మ దోషముల్ క్షమియించి ♦ పరరాజ్యమొసగునన్ పాదిరొకట
ఖల్మాచదువకున్న కాఫరేసుమి రసూల్ ♦ మతమెశరణ్యమన్ మౌల్వియొకట
లింగమేస్రీప్రాణలింగమ్ము త్వరపసి ♦ లింగధారణమనే జంగమొకటముగాను
గీ॥ తరిమివీపులు తెగగాల్చు గురువులొకట ♦ సత్యమతమేదొ దానినేసాటుమయ్య॥
సీ॥ నీవొక్కరుండవే నిఖిలశరణ్యుడా ♦ సర్వశ్రేష్ఠుఁడవన్న స్వామినీవె
వెలుగులఁ వెలిగించు వెలుగన్నగానీవె ♦ కంటికిరెప్పట్లు కాపువీవె
కలిగింపవెలిగింప మలిగింపగనునీవె ♦ సర్వలోకములకు సాక్షివీవె
నిర్వికల్పుండవు నిష్ప్రపంచుండవు ♦ నిర్గుణబ్రహ్మంబు నీవె తెలియ
గనగనజ్ఞానగాఢాంధ ♦ కారమొదవి నిన్నుదెలియంగనీయదో నిష్కలాత్మ॥యఖి॥
సీ॥ గురునాజ్ఞమీరుచో నరకంబుగలదని ♦ యెరిగిజీవులపైని కరుణవశత
తనశాశ్వతానంద ధనముచూరనొసంగ ♦ దుర్గతికింతైన దుఃఖపడక
గోపురంబెక్కి సద్గోప్యమౌతిరుమంత్ర ♦ రాజమ్మునే యతిరాజుసాటె
పారునీపంచముల్ బాహాటముగనొక్క ♦ తీరుజూచినయట్టి సారగుణుఁడు
గీ॥ నైనరామానుజుని మతంబక్కటకట ♦ పాయఖానెనొనర్చిరో పాపమతులు॥య॥

సీ॥ కంచుకోత్సవములు ఖలరాసక్రీడలు ♦ నందెన్ని మోయుల తందనాలు
శేషమ్ములవి యెంచి చెప్పనసహ్యముల్ ♦ పంచనులమ్ముల భక్షణములు
మిథునకైంకర్యమ్ము లథమప్రసాదముల్ ♦ గోపగోపికల దుర్గోష్ఠిజాలు
తల్లిపిల్లలమధ్య తగనట్టి కల్గులు ♦ పశితాళసంబంధు ప్రియతమంబు
గీ॥ అన్ని లెక్కించి జెప్ప నాకనువుపడదు ♦ బహుళహూనీచ పనులట్టి బ్రబలెనయ్య ॥

సీ॥ శిష్టులనలయించి దుష్టుల వెలయించి ♦ కరుణదవ్వుగ బంచి కఠినమెంచి
తస్కరకలను జేర్చి దాతల బోకార్చి ♦ సత్యమ్ము నొంచి యసత్యమొంచి
మానినులను యవమానాగ్నిలోఁ గాల్చి ♦ పొంచి పిరులగూల్చి బుద్ధి నూడ్చి
భక్తసంఘమ్ముల బరిమార్చగా ఘోర పాపమ్ము వేధింప భయము గల్గి
గీ॥ శరణు మాం రక్ష యనుచు నిచ్చె తజేసు ♦ పాపి నేలితివంట యోభక్తవరద॥ ॥యుష॥

సీ॥ ఒక గుడికట్టించి వాకదండము బెట్టి ♦ నారాయణుండనే పేరొసంగి
నవకోటిలింగార్చనావిధి సల్పిన ♦ వాని మస్తుని జేసి వైచినావు
సిదాసజనులను నిర్మూలమొనరించు ♦ దుష్టజనాళిలో దూరినావు
పరుల గొంతులు గోయు పాపాత్ములను జేరి ♦ శివసాధుభక్తుల జొడినావు
గీ॥ రేసు బల్కుటగాదిట్టు లెంచిచూడు ♦ వ్రాసిరాకీతి కవులెల్ల వసుధనిండ. ॥నఖ॥

సీ॥ సాధుదూషకుఁడును సన్మార్గదూరుండు ♦ నన్నృతవాదియును ఖలాత్మకుండు
తస్కరమూర్తియు ధర్మాంతకుండును ♦ ఘోరదంభాలాప కుత్సితుండు
వేసగాఁడును మహామోసగాఁడను త్రాగు ♦ బోతును చెడుదున్నపోతుసముఁడు
మరియాదకడద్రోల నూహేంద్రజాలియు ♦ కుగుణియై దబ్బరల్ గూయునట్టి
గీ॥ మనుజునకుఁ దల్లిదండ్రులై మహిని వెలయు ♦ వారి తొలిజన్మదుష్కర్మఫలముగాదె॥ నఖి
సీ॥ పరధనంబుల కాసపడి పంచలఁబడి ♦ విలపించుచున్నట్టి వెర్రులార
సకలేశుఁడగు నన్ను సరకుసేయక దీన ♦ తతి నేడిపించుదుర్దైత్యులార
ఉపకారులను వీడి యపకారులనుఁ గూడి ♦ కష్టంబులొందు నికృష్టులార
దీనులౌ వారల హీనతఁ బొడగాంచి ♦ కరుణఁ బెంచని మహాకఠినులార
గీ॥ పరుల కుపకార మొనరించి బాగుపడుఁడ ♦ టంచు వచియించుమయ్య లోకాధినాథ॥ నఖి
సీ॥ లోకంబులెల్ల నీలోన బంతులమాడ్కి ♦ తిరుగుచున్నట్టి యీతీరుఁ జూచి
నింగి బారెడిపక్షి నేలఁ బ్రాకెడి చీమ ♦ సైతము నీయాజ్ఞ సల్పఁ జూచి
హరుని యానతిలేక నాకులల్లాడవన్ ♦ పెద్దలు వచియించు సుద్దినెంచి
శివునాజ్ఞలేనిదే చీమైనఁ గుట్టునా ♦ యనియెడి లోకోక్తి నాలకించి
గీ॥ నోరులేనట్టి ప్రాణులఁ గ్రూరచూపు ♦ చూతురే గాని నీరూ[illegible]డరేమి. ॥నఖి॥ ౧౫

సీ॥ ప్రాణు మృత్యువు రేపు తప్పనిసరియని ♦ యెరిగి యెవ్వడు వేడె నేలియాసు
...షబట్టుటకునై దాయాలు వెమకంగ ♦ చేరజీరినయట్టి ధీరుడెవడు
...లువనగొట్టి యాతులువలు యీశెచే ♦ గ్రుమ్మ తద్బాధచే సొమ్మసిల్లి
వీరు చేసెటిపని నీ రెరుంగరు స్వామి ♦ జాలితో జూడుమీ బాలకుల న
గీ॥ టంచునిఖిలేశు ప్రార్థన మాచరించు॰ సాత్వికాగ్రణి యేసును సన్నుతింతు ॥నఖ
సీ॥ నిన్నెరుంగని మహానీచాత్ములకునెల్ల ♦ దహనసంస్కారముల్ దగునుగాని
నీసేవకాశించి నిన్మదిధ్యాసించి ♦ తన్నెరింగినతోనె నిన్నుగన్న
ధన్యాలకేటికి దహనసంస్కారమ్ము ♦ లారోగ్యవంతున కౌషధమ్ము
నిప్పింతుననువాడు మొప్పగాడా భువి ♦ రోగబాధితున కేలాగునైన
గీ॥ మందొసంగినవాడె సూమనుజుడనగ ♦ తిక్కబుర్రలు యీదారి త్రొక్క లేరు ॥నఖ
సీ॥ పూజింపదగినట్టి పుణ్యాం బొనర్చిన ♦ తనువు కట్టెల జేర్చి తగులబెట్ట
గా వెట్టి వారలు కట్టల న్బొడుచుచు ♦ కాల్చుచే పరువంట గరళకంఠ
తల్లి గర్భమువంటి ధరణిని నిక్షేప ♦ మాచరించుట మహానీచమంట
ఆయాత్మపరమంద నఘసేవవిధియుంట ♦ శివశివా యేమని చెప్పవచ్చు
గీ॥ కూళతాళతృసంఘమ్ము గురువులయిన ♦ కతననేగద యిట్టిదుర్గతులుగల్గె. ॥నఖ॥

సీ॥ దేశమం దెల్లడ దిరిగి వేసారితి ♦ నించుక యినను లాభ మెరుగ నైతి
పూర్వాపరములన్న బొత్తిగా నెరుగని ♦ కూళల సేవించి బేల నైతి
నైహికసుఖములం దాసక్తిని వహించి ♦ పరమేశ నీసేవ మరచిపోతి
తక్కులాడుల మాయ చిక్కులం బోబడి ♦ తండ్రి నిన్ మనసున దలచ నైతి
గీ॥ నక్కటా కాలమెల్ల నిట్లయ్యె వ్యర్థ ♦ మేమి యొనరింప బాల్గొదు స్వామినాథ॥ నక

సీ॥ నాయసంబట్టుల హేయంబులకు లొంగి ♦ పరపీడనముల దిని బలిసినాడ
సిగ్గులనుబట్టి నగ్గాడు కుటిలుల ♦ పాదసేవలలోన ప్రబలినాడ
సత్యధర్మములన్ జంపివైచిన మహా ♦ పాపుల స్నేహితులెన్ని బల్కినాడ
నభిమానమును బట్టి యూవన్ని పై బడగొట్టి ♦ వైతక్క లాటలకు దరిసినాడ
గీ॥ నెందులో నైన నానంద మందినాన లేదు లేదయ్య లేశమున్ లేదు లేదు. ॥నక॥ 96

సీ॥ దాస్యమ్ములొనరించి హాస్యమ్ముపాలయితి ♦ గాని సుంతఫలమ్ము గాంచనైతి
ద్రిమ్మరినై కొంత దేశమ్ము తిరిగితి ♦ గాని సుంతఫలమ్ము గాంచనైతి
భట్టునై పాపుల ప్రస్తుతుల్ జేసితి ♦ గాని సుంతఫలమ్ము గాంచనైతి
మీసముల్ దీయించి వేసముల్ వేసితి ♦ గాని సుంతఫలమ్ము గాంచనైతి
గీ॥ కాలమెల్లను స్వామి యీకరణి బోయె ♦ నేమి సేయుదు సద్గురు స్వామి యింక ॥నక॥

సీ॥ బాడబులాకల్లు పాటలుబాడిరి ♦ యాశిగల్ మిముజేరు జూడగనిరి
భరణముల్ క్షత్రియుల్ భక్షింపుచుండిరి ♦ పారులేధర గొప్పశూరులైరి
సానికులంబెల్ల సంసారులగుచుండ ♦ కులస్త్రీలు స్వైరలై వెలయుచుండె
గాయత్రిజపమును గావించె శూద్రుండు ♦ హాలికత్వము బాపనయ్య సల్పె
గీ॥ సారభూభాగముబ్ధి యుబ్ధిభూమి ♦ గాగ మారునో యనుభీతి గల్గెనయ్య॥యః॥

సీ॥ వేటగానికి దయ వెలకామినికి కూర్మి ♦ జారున కొకరామ యరికిప్రేమ
లంచగొండికి [illegible]సత్యమ్ము దుర్మార్గ ♦ వర్తనునకు పుణ్యవాంఛితమ్ము
ఖ్యాతశీలురకెన్న సూన్యతవతమును ♦ త్రాగుబోతునకు మనస్థైర్యమెుండు
తస్కరునకు నీతి ధర్మహంతకు ఖ్యాతి ♦ కుమతికి తమభీతికువలయమున
గీ॥ గలుగదెన్నఁడు గలిగినా నిలుచుటరుదు ♦ బాపురే లోకవృత్త మిప్పగిదినుండె॥నఖ॥

సీ॥ మా కటాక్షంబుచే మహిభాగ్యవంతులై ♦ విలసిల్లినటువంటి విమతజనము
బీదసాదలనెల్ల బాధలుబెట్టిరి ♦ భక్తులచెడదిట్టి పారగొట్టి
పాపులగుమిగట్టి బందిపోటులుగొట్టి ♦ పరకాంతలన్ చెరల్ బట్టియెల్ల
ప్రాణిహింసలొనర్చి పాంధులబరిమార్చి ♦ ఫలభూరుహంబులు పాడొనర్చి
గీ॥ లోకమెల్లను యిటులెచీకాకుగాగ ♦ జేయుచున్నారలటుజూడు చెనటిజనులు॥యఖ॥

సీ॥ పూజింపదగినట్టి పుణ్యాత్ము దేహమ్ము ♦ మంటలపాల్సేయ మంచిదంట
కటికియొజ్జల కాళ్ళు కడిగిన పితరులు ♦ పాపంపు చెరనుండి బాయునంట
పత్రిపుష్పాక్షతల్ భావ్యమ్ము గాదంట ♦ మాలవారలపోల్కె మంచిదంట
కూళాత్ములౌ దున్నక్రూరలగుంపుకు ♦ మనబోతుగురువు యుమామహేశ
గీ॥ తండ్రి నీసేవ జేసిన ధన్యమేను ♦ పూడ్చిగట్టెడ మరియాద పుణ్యమూర్తి ॥యఖ

సీ॥ కామమా పస్తుకకాల్పుచున్నది ♦ క్రోధమా నిలువునగాల్చుచుండె
లోభమా సుంతయుఁ లాభమివ్వనిగయ్యె ♦ మోహమా దరిలేని దాహమిచ్చె
మదము కన్నులమూసి గదుముచున్నది ♦ మచ్చరం బోమించి పిచ్చి బెరిగి
క్రూరకృత్యంబుల తాడుమారుగ జేయవలెనని ♦ బోధిపవచ్చె జూడు
గీ॥ మెట్టులేదుదు భవవారి యిట్టినేఁగ ♦ గట్టిదయ యాన నోడ మెట్టుకున్న ॥నఖ॥96

సీ॥ తెరవమోమన్న చో తేరిచూచె డిక్కండ్లు ♦ సాధుదర్శనమున్న సంతసిలవు
రంకుకూతలు వినన్ శంకనొందని చెవుల్ ♦ గురువ! నీస్తుతులన్నకూలవందు
తప్పుకూతలె కూయనొప్పుచుండును నోరు ♦ యాశనస్త్రవమున్న మూసిపెట్టు
నంగనాచొంగస్న చెంగలించెడు జిహ్వ ♦ స్వేచ్ఛ సమనగానె శోలగిచనును
గీ॥ బాపురే యింద్రియములనేకాపు లిట్లు ♦ లుండగ రాజు ఋండగాఉండు టెట్లు ॥లఖ

సీ॥ ఆహము విసర్జించి యభిమానము ద్రుంచి ♦ కామాది శత్రులకడగ బంచి
యాశపాశలు ద్రెంచి మోహవృత్తుల డంచి ♦ గర్వమ్ము తుంచి సత్కరుణ బెంచి
యింగితమ్ము దలంచి యీషణమ్ముల నొంచి ♦ రాగమ్ము నదలించి రక్తిగాంచి
పరమాత్ము నిన్నెంచి భక్తితో సేవించి ♦ నీవె తానను మాటి నిశ్చయించి
గీ॥ యున్నవారలు భువి నిన్ను గన్నవారు ♦ నిన్ను గనకొన్నవారలేమన్నవార ॥లఖి॥
సీ॥ వైద్యమ్ము హరికథల్ వల్లించుట బేరమ్ము ♦ కవితమ్ము గానమ్ము కంపినీలు
పగటివేసమ్ములున్ బడిపెట్టుటయు నాల్గు ♦ కొంగులు ముడిపెట్టి చికోనట బల్ల
గ్రుద్దుటయుఁగా రైతుకూలినొనర్చుట ♦ కోర్టులో కొల్వు టోల్గేటు కావు
పశువుల గాయుట పనిలేక తిరుగుట ♦ యాచనాదులవిక నెన్నొ గలవు
గీ॥ పాడుసంసారమునకిన్ని పాట్లుబడితి ♦ నన్ను శివశివ! సౌఖ్యమ్ము సున్నయయ్యె ॥నఖి॥
సీ॥ భవరోగముల ద్రోలు పరమౌషధము నీ ♦ పదిరెండు మాత్రలు ప్రభువరేణ్య
పరమవైరాగ్యసత్పథమందు నిల్పు నీ ♦ పదిరెండు మాత్రలో భక్తవరద
సర్వలోకాతీత సరణిజూపించు నీ ♦ పదియారు మాత్రలో పరమపురుష
పాశజాలమ్ముల బరిమార్చు నీదివ్య ♦ బోధామృతరసమ్ము భోగిభూష
గీ॥ పల్లమందుల కేమయ్యె గలవుకొల్ల ♦ కాదు భవరోగహారమందు గానరాదు ॥నఖి॥

సీ॥ మూడుమేనులుగాక మొదలును తుదిలేక ♦ వెలుగుచున్నట్టి యావెలుగు నీవు
నీవె నేననునట్టి నిశ్చయంబగుసూక్తి ♦ దయచేసితివి మహాధన్యతముడ
నైతినిగాని నా కయ్యాది శాశ్వతం ♦ బగునట్టి వరమిచ్చి యాదరించు
నేడుగల్గిన తెల్వి వీడునేమోనని ♦ భయ ముద్భవంబయ్యె భవమహేశ
గీ॥ వెరువవలదని కరము నాశిరమునుంచి ♦ యభయహస్తమ్ము దయచేయుమయ్య నాకు

సీ॥ సకల భూతములు మీసారూప్యముగ నెంచు ♦ ధీరుడే మాంసంబు దినుచునుండ
నిన్నెరుంగనికూళ నీచాతినీచుండు ♦ పిశితాశనంబన్న భీతివడునె
తండ్రిత్వకారుణ్య తత్వమ్ము చవిగొన్న ♦ వారలే ప్రాణుల వధనహింప
సోదరునసిగూల్చి వాదితరులవేయు ♦ కఠినాత్మకేరీతి కరుణగల్గు
గీ॥ తామె తామను తత్వజ్ఞతతికె ముందు ♦ జీవకారుణ్యమును దయసేయుమయ్య॥ యం

సీ॥ సప్తదుర్వ్యసనముల్ సమవర్తికడకీడ్వ ♦ కరుణపాపాత్ము నేకరణిజేరు
కరుణదూరంబయిన కఠినాత్ము కేరీతి ♦ ప్రాణిహింసను మానుభాగ్యమబ్బు
ప్రాణిహింసనుజేయు పలలాశికేలాగు ♦ తావకాంఘ్రులయందు ధ్యాసగల్గు
తావకాంఘ్రులభక్తి దన్వైనవానికి ♦ భవరోగముల నెల్లబాయునయ్య
గీ॥ బహుళయోనుల జన్మించి బాధలొందు ♦ గాక కడతేరుమార్గమ్ము గలుగబోవ॥ దక్ష

సీ॥ ప్రాణముల్ దీయక పలలమేగతియబ్బు ♦ గతప్రాణి దేహమ్ముగాదె పీన్గు
పీన్గుల మెసవుటే పిశితాశనంబెన్న ♦ వారె పిశాచముల్ వసుధనెల్ల
ప్రాణికోటులకును ప్రభువైననరజన్మ ♦ మెత్తినందుకు ఫలంబెగ్గులేక
పైశాచికంబైన పలలంబు మెసవుట ♦ కరుణాఢ్యవైన కతనగాదె
గీ॥ కరుణయెడమైనవానికి గలదె ముక్తి ♦ ఘోరనరకాగ్నిలోపల కూలుగాక ॥సఖ॥
సీ॥ ఫాలనేత్రము గంగ పాములు రేరాజు ♦ డమరుకశూలమ్ము నుమను మరియు
గజదైత్యతోలు వ్యాఘ్రాజినమ్మును మద్దు ♦ తనయుల ప్రమథుల దవ్వుజేసి
కొనినన్ను గావగా కువలయంబందున ♦ నరరూపమెత్తితో పరమకరుణ
జరుగు వేంకటగురుస్వామి వంచొంచితి ♦ పరమేశ్వరుడవ మాంపాహినీదు
గీ॥ భక్తవాత్సల్యమెంతని ప్రస్తుతింతు ♦ దేవదేవపరాత్పరా దీనబంధు ॥యశ॥
సీ॥ కరుణాలవాల వేంకటగురునాథనన్ ♦ కరుణింప నీకన్న ఘనులులేరు
భక్తవత్సల! నాదు పాపమ్ములనుద్రోల ♦ గల పుణ్యులెందు నీకన్న లేరు
పరశివాననుబట్టి పావనునిగజేయ ♦ నెక్కడ నీకన్న దిక్కులేరు
పరమేశ! నీదివ్య చరణముల్ నమ్మితి ♦ మరుగుజేరితి నన్ను కరుణనేలు
గీ॥ కొనుటనీభారమది నాకుకొదువలేదు ♦ పరమపదనాథ శ్రీగురుప్రభువరేణ్య ॥యశ॥

సీ॥ దశవిధేంద్రియములు తనకు లోబడగానె ♦ యేకాదశీయటం చెరుగవలయు
నంతస్సుఖతనెల్లి యాత్మారాముండైన ♦ నుపవాసమనుచు నూహింపవలయు
నాకీతి మరువని దదియె జాగరణమ్ము ♦ గానెంచి గురురాజు కరుణతోడ
బల్కినద్వాదశి పారాయణము సేయ ♦ నదియె ద్వాదశి పారణనగబరగు
గీ॥ నదియె యేకాదశీ వ్రతంబిపుడు గాను ♦ తెలియ జెప్పితివా దయను దేశికేంద్ర ॥యు

సీ॥ సంసారమను దొడ్డ సరసి లోవసియించు ♦ మకరి యే మోహంబు మాయతృష్ణ
దాహబాధకులోంగి దరినున్న కొలనికి ♦ జీవుడను గజరాజు జేరగానె
మోహమను మకరి యా దేహియా జీవుని ♦ పట్టి పీడించగా పరుని వేడ
కరుణాంతరంగుడై గురునాథుడై వచ్చి ♦ యాత్మైక్యమను చక్ర మట్టిబాప
గీ॥ మోహమనునట్టి మకరి నిర్మూలమయ్యె ♦ నంత జీవుండు దేవుడై చింతబాసె ॥నక్షి

సీ॥ ధర్మశాస్త్రములలో మర్మముల్ నేర్పక ♦ పాపమ్ము నదలించు పనినటుంచి
కూటసాక్ష్యమ్ములం ధాటగా బోధించి ♦ కోర్టుల కెక్కించి కొంపగోడ
యమ్మి యొసంగినా యదిచాలదనివారి ♦ పట్టుక శోధించి భయముతనించి
వాకొనను కొనక వశముగానటువంటి ♦ కృత్యమ్ములను మాన్పి సత్యనియతి
గీ॥ క్లీడ కీలకు నేర్పి సంప్రీతి వారి ♦ నరక బాధల దొలగించు పరమపురుష

సీ॥ మంగళంబాద్యంత్య మధ్యశూన్యంబౌచు ♦ నున్నట్టి హేసుప్రసన్నలింగ
మంగళంబవ్యయ యుమామానినీలోల ♦ భవభంగధవళాంగ భావలింగ
మంగళంబఖిలేశ మామకహృదయేశ ♦ దుష్టాటవీకీలయిష్టలింగ
మంగళంబిదెగొను మహాదేవసాంబనీ ♦ భక్తినోసంగుమా ముక్తిలింగ
గీ॥ మంగళముసంగమేశ్వర లింగనీకు ♦ మంగళముమల్లిఖార్జునలింగనీకు ॥న॥ 110

ఇది

శ్రీమజ్జరుగు వేంకట సద్గురునాథాంతేవాసి గాజుల రామస్వామిరచిత

ప్రాణలింగశతకము

సంపూర్ణము.

ఓమ్

శ్రీ గురుభ్యోన్నమః

# బ్రహ్మానందసుధాలహరి

1. శ్లో॥ గురుర్బ్రహ్మా గురోర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః। గురుసాక్షాత్ పరబ్రహ్మం
తస్మై శ్రీగురవేనమః॥

2. శ్లో॥ అఖండమండలాకారం । వ్యాప్తంయేనచరాచరం తత్పదందర్శనంపుణ్యాం ।
తస్మై శ్రీగురవేనమః॥

3. శ్లో॥ మన్నాథజగన్నాథా। మద్గురో శ్రీజగద్గురో మమాత్మాసర్వభూతాత్మా ।
తస్మై శ్రీగురవేన్నమః॥

కన్నడ ఆట.

1. దేశికదేవా దాసోహంబావా । దాసునిబ్రోవ దర్శనమీవా ॥ దే॥
యేమనజాల యీమహిబాల కామునికోల కనుగొనజాల ॥ దే॥
సత్యము నీవుఅసత్యమునేను నిత్యముగాను నెరనమ్మినాను ॥ దే॥
సంసారమెల్ల సాక్షినావల్ల చేయించుచల్ల జేసెదకొల్ల ॥ దే॥
పరలోకమేను పాడుజేసినాను ధరయందులేను గురునీదేను ॥ దే॥
కామినిగాను కాంతపైలేను సామినినేను యేమనరాను ॥ దే॥
దేహముగాను దేహినినేను దాహముగోరి దరిజేరినాను ॥ దే॥
దేహికిదాపు దేహముబాపు దాతనీకు రేపుదెచ్చెదచాపు ॥ దే॥
యేమందునయ్యా యెవరులేరయ్యా యెక్కడజెయ్యా యెందునేవయ్యా ॥ దే॥
తల్లివినీవు తండ్రివినీవు దాతవునీవు దైవమునీవు ॥ దే॥
వున్నదికొయ్యి వుపదేశమియ్యి చల్లనిచెయ్యి తలమీదవెయ్యి ॥ దే॥
వెంకటయోగి రంకులత్యాగి బొంకులువాగి పోనుబైరాగి ॥ దే॥

తోడి ఆట.

౨. యేమిటో నేనెరుగనైతిని యిన్నాళ్ళవరకూ స్వామినేనని గాననైతినీ

కామిగానే గాచియుంటిని సాముజేసి సగముచెడితిని భామముం
దరభావిలోబడి యేమిజేసిన వూరకుంటిని ॥యే॥
తల్లిగర్భముజేరుకుంటినీ తొమ్మిదినెలలీ కల్లయుగమును గానకుంటిని
యెల్లలోకములందునేను కొల్లగాచచ్చుచునుపుట్టితి తల్లిదండ్రులెందరైనది
యెరుగజెప్పజాలని నేనేమిటోనే నెరుగనైతీనీ॥
బాలప్రాయము బాగజూచితినీ బందరూపురములో బాలుడానై యాడుకుంటీనీ
మాయజాలములోనజిక్కి మాయమయ్యే జనులజూచి
చాలగాభయమొంది సద్గురుబాలుడానై తిరుగనేరక ॥యే॥
కామక్రోధము దెచ్చుకుంటీని కొన్నాళ్ళవరకూ కామినులపై కాంక్షగొంటీని
నామనీమములెరుగనేరక నాసికములో నడువనేరక
రామరామయనుచుబూనక రాముడెవరో గాననేరక ॥యే॥
వన్నెమీరిన గురునిజేరితిని కొన్నాళ్ళక్రిందట అన్నియాశలు అమ్మివేసితిని
దున్నపోతుచిన్నెలన్నీ ధూళిజేసికొట్టితిన్నీ వన్నుగాసద్గురునివాక్యము
విన్నతోడనె నన్నుగాంచితి ॥యే॥
ఆత్మలోపల హరినివేడితినీ సాత్త్వికముచే ఆత్మనాత్మకు హరినినేనైతీ

ఆత్మనందుకు సాక్షి నేనే యాత్మననుచూ అంతు దెలియక పింతగానే
జరుగువేంకట యోగినంచని యెరుగజేసితి ॥యే॥

సీసా॥ ఉపదేశమంచని యుర్విలో ప్రజలంద రపదేశముడుగకే యాడుచుంద్రు
కృపలేనిగురువుల నుపముగాగొని ।సత్య। తపముసాధించ బోయ్యేరు
నెపమూలువెదకే యుపమూలె సేయుచుందూరు
యజపగాయత్రిబట్టి భుజగము లేవగొట్టి సుజనూలచూపునట్టి
రజనూనుదీసిసత్వ ॥తపము॥

సీసా॥ రామునామంబుచే రంజిల్లుజనులెల్ల రామునిగనలేక రాజులౌనె
యేమిటోయీమాయ యీమహీజనులంత॥ రామూనిజూచియుందురే
కామామురచి నీమాముతోడనుందురే యేమియు నెఱుగనట్టి
రామూనిపేరుబట్టికామాక్రోధాలుకాళ్ళదన్ని పామ్యోటివేళ
రామూనిజూచి యుందూరే.

నీలాంబరి అట.

విడువరోరి అకారం ఉకారం మకారం ఇదియేరా సాకారం సాకారం సాకారం ॥వి॥ వ్రాయరోరి నకారం మకారం శకారం యకారం వకారం జయ

పూరా ఓంకారం ఓంకారం ఓకారం ॥వి॥ అడుగరోరి కకారం చకారం టకారం అడిగివినగదరోరి జకారం ఞకారం ణకారం॥వి॥కోరరోరి తకారం పకారం యకారం కోరిపొందగరోరి నకారం మకారం ॥వి॥ లేమరోరీ ఖకారం భకారం ఠకారం లేనిచోటుమెట్టుందు మకారం యకారం సకారం ॥వి॥ చేయరోరి సకారం హకారం ఓంకారం జరుగు వేంకటయోగీ నకారం మకారం హకారం ॥వి॥

## కళ్యాణి ఆది.

కాలమె బ్రహ్మకాలమె విష్ణుకాలమె శివుడని కూలరయా ॥కూలినచోటను బాలసుగనుగొని యాలలు యాల పాడరయా ॥కా॥ కాలము వర్షాకాలము శీతాకాలము వేసవి మూర్తులయా కాలంచక్రం కాకులుమూడు రజఃసత్వ తమోగుణములయా ॥కా॥ మూడుకాకులూ ముఖ్యముగా యీమూలబంధముకు కావలయా మూటినిజూచీ మూటినిబాసీ మూలప్రకృతినిమూనరయా ॥కా॥ వత్సరమ్మై ఓంకారంబై తే వానిలో వానిని గానరయా వచ్చినవారము వచ్చినట్లుగా వచ్చే మార్గము వీడరయా ॥కా॥ వర్షాకాలం బ్రహ్మపట్టణము వేసవికాలం కైలాసం వైకుంఠంబే శీతాకాలము వట్టిభ్రమలనటు నెట్టరయా ॥కా॥ పంచభూతముల తోడను కాలముపాడు ప్రపంచము జేసెనయా పంచాక్షరములు పఠన జేసియా

ప్రపంచనడతలు మానరయా ॥కా॥ చక్రమెనాదం చక్రమెబోధం చక్రమెసాధం చిత్రమయా చక్రముదెలియక శౌరినిగూర్చే తుక్కులమూకల కందనయా ॥కా॥ రేపు మాపులను బయలెరుకలకు రూపురేఖలనిచూడయగయా రేపే మాపు మాపే రేపు రూపేమాపు జేయరయా ॥కా॥ మూడుఆకుల చక్రములోపల మురికి ముచ్చటలుమానరయా మూలముదెలశీ మూడుఆకులను ముక్కలుగా తెగనరుక రయా ॥కా॥ పదిచరణంబులు బాగుగజదివీ బాహ్యాంతరములు తెలియరయా బాంహ్య బాహ్యము వెంకటయోగికి బహుదూరంబని తెలియరయా ॥కా॥

నాదనామక్రియ - అట.

ఏమీలేదేమో యున్నదిరా అదియేమీయనరాకనూ యేకమైనదిరా ॥ఏ॥ అంతుమొదలులేకున్నదిరా దానినంటబోతెలేదు ఇదిగోయున్నదిరా ॥ఏ॥ దండకారణ్యమున్నదిరా దానినిండావెన్నెలగాచి యెండిపోయినదిరా ॥ఏ॥ పండువక్కటి పండినదిరా దానిపగులగొట్టితే అయిదుగింజలున్నవిరా ॥ఏ॥ చూచితే చిత్రమున్నదిరా అదిచూడనివారికి నేత్రమొందుకురా గోచిపాత్రైన దొరకదురా వాచావైరముమాని సీయచలముగనరా ॥ఏ॥ పుట్టలో పిట్టాయున్నదిరా దానిపట్టబోతే జెట్టచేతికున్నదిరా కట్టివేశితె కర్మవిడురా ఇట్టివట్టిమాటలుజెప్పే దిట్టయెవ్వడురా ॥ఏ॥ అయిదుపాములు

ఆడుకొనురా అట్టిఆటలాడించేటి ఆడమున్నదిరా అంగములతో దాగున్నదిరా దాని నాటలో వోడించే జాణ యెవ్వడురా ॥ప॥ చిలుకలు పలుకుచున్నవిరా వాటిపలుకులు వినబోతే వలికిదగ్గరరా యెలుకపిల్లిని జంపుగదరా దానికులుకుజూచితె తళుకు తళుకువన్నెలురా ॥ప॥ అంతటనిండియున్నదిరా అది చింతవింతలులేక చెలగుచున్నదిరా రంతూలు మెరుగకున్నదిరా బలవంతూలువచ్చి నాభయములేనిదిరా ॥ప॥ ఆశలెల్లను బోయెగదరా యీశువాసముదెలసితే నాశదూరమురా వాస వసంతు లెరుంగునురా దీనివాసము వేంకటదాసు లెరుగునురా ॥ప॥

## కళ్యాణి - ఆట.

చదివే చదువును విడువరా చదువునుదెలసి చదివేచదువును చదువరా॥ చదివేచదువును విడచి సన్యాసిమార్గమున కదరుచునాలుక వదరుకూతలుమాని ॥చ॥ నాదమె బ్రహ్మమురా నాదమె విష్ణు నాదమె యీశుడురా యేదిరా యీమూడు లోకములలోకర నాదముమించి వినోదముజెందను ॥చ॥ యేమిలేనిచోటను యేమో పుట్టి యేమొ యేమొ ఆయెను. యేమిలేనిచోట నేమిపుట్టనేలేదు పుట్టలేదను యోగి పుట్టచచ్చెగాని ॥చ॥ వచ్చెపోయెదారిలో వనమున్నాది బొచ్చుఅందురు భువిలోను మచ్చరమునించి సీహెచ్చురూపముజూచి ఛీ! ఛీ! ఛీ! యనుచూ చీవాట్లుబెట్టకొరకు॥

॥చ॥ వేటబయలు దేరరా ఈటెయెత్తి కాట్లకుక్కలజాపరా యేటియొక్క హుబోయి యెఱ్ఱమానుయొక్క దీటైనపండూను నోటగరచేకొరరు॥చ॥పంచవన్నెల మేడలో పట్టె మంచం పడుచుపంచినజాడలో యెంచివెంకటయోగి పంచూచునున్నాడు సంచితముగ దానిపంచజేరేకొరరు ॥చ॥

శ్రీరాగము - ఆది

నేనన న నేనన న నేనన న అనుకో జీవా నేను నీవూ యేకంబైతే నీవేనేనను కో॥ పాములేనిపుట్టలోన పండుందిదెఖో జీవా భావముపోదోలే భక్తిమార్గమూ కనుగో॥నే॥ మఱుగులేనిచెట్టుమీద మొండిములదముకో జీవా భావమనే చీరగట్టిముసుగు బెట్టనుకో ॥నే॥ ఇంద్రియమ్ములు యీడ్చేవాని యీడనీవనుకో జీవా యింద్రియమ్ముల వెదకి వానిసిపిడితె నేననుకో ॥నే॥ సాకారమునకు సంబంధించే చర్యనీవనుకో జీవా సాకార నిరాకారమ్ములకును సాక్షినినేననుకో ॥నే॥ గురుడనయెఱుగని కూళ జనంబుల గుర్తేనీవనుకో జీవా గురుడేహరుడని గుణములగూర్చిన గురుడను నేననుకో ॥నే॥ నాలుగుమాటలు నయముగనడిపే నరుడేహరుడనుకో జీవా నాలుగురోజుల నటనకుభ్రమిసే నాట్యమునీవనుకో ॥నే॥ ఆశచేత తనఆత్మనుదెలియని వాడేనీవనుకో జీవా ఆత్మనుదెలసిన జరుగు వేంకటయోగిని నేననుకో ॥నే॥

## నాదనామక్రియ - ఆట.

గంగాయమునా నదులలో మునగరా దానిరంగైన మేడలో రాజ్యమేలరా గం॥ అంగనామణి యాటలాడునురా దానిబంగారువీణలో పలుకులు పదిరా ॥గం॥ రంగుభారతిపై గానున్నదిరా బంగ్రుదా గేటియోగికి భావియున్నదిరా చెంగుప్రూడితె చెయిబట్టుకొనురా చెంగుప్రూడే సాధనదెల్పే సద్గురునిగనరా ॥గం॥ మేడకెటు జూచినా యేడేమట్లు జాడదెలియక యెక్కితే కోటీతప్పోట్లు నీటుగాంగ్రడందరికి యివేపాట్లు ఝూటమాటగాదిదిచూడు వేదమందిట్లు ॥గం॥ ముద్రభావముతో ముందుబట్టు శ్రద్ధాపద్ధతులను దెలసీ యావలికినెట్టూ భద్రమైన షణ్ముఖముద్రబుట్టూ ముద్రబుట్టీన మునులు ముప్పదిమూడుకోట్లు ॥గం॥ అయిదుమందిరములలోనసుందూ అయిదు అయిదైదులిరువదియైదులోనుంసూ ఖైమవీడితెకర్మముబందూయింతమర్మము దెలియక యవరినిందూ ॥గం॥ యెందుయెందు వెదకిననేమిలేదు గురిజెంద నేరనివరుడు కాలినాబోడూ అందియుండానివారికి వాదుసాదమందే సంపూర్ణము సరిగానుగాదు ॥గం॥ కోటికోటనికొలువు గొలువారా కోటికోటనికొలువులో కోటిసూర్యులురా షాకీపారానినదులు మూడటరా యేడుదాటితె యేకాంతనాపమేనటరా ॥గం॥ రాజు

లేనట్టిరాజ్యం త్రికూటం రాజులేనట్టిభూమియు రాజ్యమెట్లవురా యోగరాజే
వేంకట యోగివినరా రాజ్యమేలెడిపద్ధతి రాజుచేగనరా ॥గం॥

నాదనామక్రియ - అట.

జాబు జాబు యోగులకెల్లబాబు జాబులోని జవాబునబాబు॥జా॥ అంటేనే యంటని యోగికి పెండ్లి అంటి యంటాని వస్తువులతని వేసళ్ళి ఆందరముగూడి యతని యింటికెళ్ళి పంటపండించే పద్ధతి యతనిచేగిల్లి కొండారా మెతిరిగొ స్వాములెళ్ళి ॥జా॥ పంచవన్నెకన్నె లైదుగురట పంచ పంచ విధములుగాను పాడుచుందురటా యెంచ శక్యముగాని నాదమటా పొంచిచూచేవారలకెల్ల మంచిమీాదనటా సంచిపూడితే సరిగా నుండునటా ॥జా॥ చిత్రాచిత్ర మేళములిరవై యైదు చిత్రాచిత్రమేళములాలో చేరున్న వైదు పాత్రమెరుగని పాపులకు ఖైదు నేత్రమున్నంతమాత్రాన నేమీ మైసైదు యాత్రలన్నీదిరిగిన యిదిలేదు సూత్రమెరుగనివానికి సులభముగాదు ॥జా॥ పెండ్లి కూతురు పెనుమంటజేరు త్రాడుదెంపిన యోగికి సరిలేక లేదుకండ్లమూతలు బడవేసి చూడు గండ్లుగడచి గంగానదిలో స్నానములాడు ॥జా॥ యెండియెండాని వారలే రండి దండివాడు వెంకటయోగి దాసూడటండి దండగేమిమనకు రాబోదండి నిండు వేడుకతోను పోదాము పదండి॥జా॥

### శ్రీరాగము - అట.

పనికిమాలిన పంటబండే పాడుకోటకుచేరరో పునఃదెలశీ పూరుజేరి తనికీ జేసుకచావరో కోటనూలనకోటిపూర్వ్యులు దీటుగానున్నారురో పాటబాడే భామలందరు పగలుచుక్కలుగాంచరో ॥ప॥ యింటిలోపల కంటినడుమను ఒంటిచిన్నది జూడరో కంటిలోననె కన్నుదెరచి చన్నగుడిచేదెరుగరో ॥ప॥ సాధుజనులను సాగదీసే చవితియొకటున్నాదిరో బాధవచ్చును బోధవింటేరాదు సద్గురునాదురో ॥ప॥ సూటిగానేచూపుజూచి యేటివాడ్డుకుజేరరో బాటతప్పితెబంపబూసులు బాబుకోపముజేసురో ॥ప॥ ఆపదాదేపావమున్నది ఆపకనుగాలిచరో ఆవరానివాంగు బొంగును ఆకులనుదిగమ్రింగరో ॥ప॥ బోధదెలిసేబొమ్మలోపల భోరుభోరునగోడురో బాధవీడును సాధనలచే గాధలోబడబోకురో ॥ప॥ వాదుజెప్పిన జరుగు వెంకటయోగివరుడే పరుకురో సాధులైనబోధకులకు నాదువార్తలుజెప్పరో ॥ప॥

### ముఖారి - అట.

మాటిలోనేచూడరా దీనిసాటియెవ్వరులేమిరా పాటబాడును ఆటలాడును వోటిచెవియనుదాటరా ॥మా॥ నాటకంబిడిచూడరా యివివాటమైనదగాదురా బూటకంబున బుట్టిచచ్చుచు బాటగాననదేమిరా ॥మా॥ నామరూపములేదురా

యిది భామయానోకాదోరా కోమలాంగికి కోటిసూర్యులకుచ్చుపుడకున్నాదిగా ॥మూ॥ కల్లసంసారమురాయిది యెల్లలోకముసిండెరా అల్లిబిల్లిపయాడరా మన సెల్లదిరుగుటచూడరా ॥మూ॥ యెన్నిజెప్పినవినమురాయిది సున్నజుట్టినగనదురా తిన్నగాతనుతననెజూచితె వున్నచోటనెమున్నరా ॥మూ॥ లేమలేనే లేమురాయిది కాదుకానేకాదురా గాధగోబడు బాధగురువుల సాధనలువినరామురా ॥మూ॥ రాసిజేసినకాదురాయిది బాసజేసినపోదురా రాసిగానే జరుగు వెంకటదాసుడిది గనజేసురా ॥మూ॥

బేహాగ్ - ఏకతాళము.

నేగాదుకాదురా నన్నుదెలియనివాడే శూద్రుడు నానాడుదెలశి నన్నుకోరిన వారేబ్రాహ్మలు ॥నే॥ కామక్రోధ లోభమోహా మున్నవాడె శూద్రుడు తమతావు దెలశి తావుజేరినవారె బ్రాహ్మలు ॥నే॥ కుక్కతోటపాటు కూయుచుండు వాడె శూద్రుడు చక్కనైనగురుని వంకజేరినవారె బ్రాహ్మలూ॥నే॥ కులముస్తలము జూచి కులుకుచుండువాడె శూద్రుడు కులముమన్ననేసి కాలమట్టినవారె బ్రాహ్మలూ ॥నే॥ చంకనాకిపోయ్యే చదువుచదివేవాడె శూద్రుడు పంకజాక్షి బాశి పందుపండిన వారె బ్రాహ్మలూ ॥నే॥ రాయిదేవుడనుచు దానినినమ్మిన వాడె శూద్రుడు రాయిరాళ్ళ

గలిపి రంగుజూచువారె బ్రాహ్మలూ ॥నే॥ ఇంద్రభోగములనుగోరి గుందువాడె శూద్రుడు దేహిదేహములను దెలిసిమానినవారె బ్రాహ్మలూ ॥నే॥ సాధుజనుల జూచి వాదులాడువాడె శూద్రుడు పాదుదెలసివానిని పాటిసేయునివారె బ్రాహ్మలూ ॥నే॥ మాయలాడినేర్పు కూతకూయువాడె శూద్రుడు హాయిదెలసి మాయచేష్ట రోయువారె బ్రాహ్మలూ ॥నే॥ జరుగువెంకటేశు నాత్మనెరుగకున్న శూద్రుడు మెరిగిపరముగాంచి తమ్ము మరువకున్న బ్రాహ్మలూ ॥నే॥

ముఖారి - ఆట.

చూడుమనసా నిజగురుని జోడుమెవరులేరే భువిని ॥చూ॥ కన్నులోనే కన్ను దెరచి మన్నులోనివన్నీ మరచి ॥చూ॥ ఘాటిగానుకూట త్రయము కోటిసూర్యుల కాంతిభయము ॥చూ॥ సూర్యసోమ శ్యామకాంతి చూపులోనే నాడుబంతి ॥చూ॥ కీడుసుమ్మా కిటికీల్ మేడ తోడుజేరినవాడే జాడ ॥చూ॥ నమ్మకమ్మా జాయాసుతుల తమ్ము దెలియాత్వరగారమ్మా ॥చూ॥ కూయబోకు తప్పుమాటా మాయబోకు ముక్తి బాటా ॥చూ॥ వెరువబోకు మెవరేమన్నా మరువబోకు మాయసున్నా ॥చూ॥ ఓనమాలజాడలేని వోటినకులమాటామాని ॥చూ॥ చేసుమనసా యేకాంతమునా యేరులే వాబాకంతమునా ॥చూ॥ తగుగులేక చూచినాను జరుగువెంకటనాగినైనాన ॥చూ॥

## శ్రీరాగము - ఆది.

ఎంతోవింతలాయెస్వామి బంతులాసాలలోను గంతులువేసే యింతినిజూచి పంతమాడిచింతబోతి ॥ఎంతో॥ సామిగాక కామిగాక పాముగాక యేమిలేక సోమ సూర్యవీధిలోన చిన్న చిన్న కన్నులైన ॥ఎం॥ అయిదుగురుకిన్నలైతి ఆరవదాన్ని కన్ననైతి అయిదైదులు యిరవైదు అందులోనేయూటగంటి ॥ఎం॥ మూడురేవులు ముణిగేచోట ముండగానిను తైయిదొకతితోడులేనివాడమీదపాడేపాట నంతావింటి ॥ఎంతో॥ నోరులేనిబారిగోత్ర కాపులిని కోర్రమింగె సారమంతాజారిపోయి పారే నదులు మూడుబుట్టె ॥ఎం॥ కొటుకొండాలానడుమ కోటిసూర్యకాంతి మెరశి కీట కములు యిరవైదును వ్రాలువిడచిబాలుపట్టె ॥ఎంతో॥ పాటిమీదపండుబగిలె కోట మూలదండువెడలె యేటిమీద యేదుకొండ లింతలోనె మోగిరిపోయె ॥ఎంతో॥ యింటి నిండామొండగాసె వెంకట మోగి బండబాసె కంటిలోనపంటజూచి వంటిగాడు జంట గూసె॥ ఎంతో॥

## కళ్యాణి—ఆది.

చచ్చిపోతావునీవు వస్తావునీవు రాజయోగమూలో రహస్యమంతా గాణించి తెలిసితెరావు ॥చ॥ పంచభూతములుగావు ప్రణవంబుగావు దాని వంచానజేయులేక

పంచనున్నావు ॥చ॥ పాయూపస్థలుగావు ప్రణవంబుగావు దానివాసనూవు దెలియ లేక గోవువైనావు ॥చ॥ గంగాయమునలుగావు ఘ్రాణంబుగావు చిన్నియంగన ఆట లాకేలొంగియున్నావు ॥చ॥ ఆధారముగావు అనాహతముగావు దానిబోధలో పలికే పలుకులెరుగకున్నావు ॥చ॥ వేణునాదముగావు వీణాలుగావు దివ్యపాణిసిగూడలేక వాణియన్నావు ॥చ॥ వెంకటయోగిమాట సంకటమున్నావు దానివంకకుజేరలేక కుంకవైనావు ॥చ॥

కళ్యాణి—ఆట.

చాలుచాలులేనిసంసారభారము సామినిజూచిన సన్యాసిరా॥ పాలుపాలు బోసి బాలవృద్ధులబెంచి పోలుపొందెరుగని ధన్యాసిరా ॥చా॥ భేదాభేదములేదు వాదములకురాదు సామినిజూచినసన్యాశిరా బోధదెలియలేదు నాదమువినబోదు పోలుపొందెరుగనిధన్యాశిరా ॥చా॥ సిగ్గుశౌర్యములేదు ఛీఛీయన్ననురాదు సామిని జూచినసన్యాశిరా॥ తగ్గుహెచ్చులుజూచి భగ్గునమండేటి పోలుపొందెరుగని ధన్యా సిరా ॥చా॥ బాల్యవృద్ధాప్యము భావాభావములేదు సామినిజూచినసన్యాసిరా జాలిజెంది దారజాలములోజిక్కి పోలుపొందెరుగని ధన్యాశిరా ॥చా॥ మోహా మోహాములేదు వ్యూహావ్యూహాలుగాదు సామినిజూచినసన్యాశిరా సోహముగనలేదు

యేంహ్యాములోదిడుగు పోలుపొందెరుగని ధన్యాశిరా ॥చా॥ నామరూపము లేదు సోమసూర్యులుగాదు సామినిజూచినసన్యాశిరా॰ భామాపుత్రుల మేపు సోమరిథండాలి పోలుపొందెరుగని ధన్యశిరా ॥చా॥ ఆశపాశలపోడు నాశానాశనుగాడు సామిని జూచినసన్యాసిరా యీశా వెంకటయోగి బాసనమ్మనివాడు పోలుపొందెరుగని ధన్యశిరా ॥చా॥

కళ్యాణి - ఆట.

రాక్షసకులమును నీసనేసు రామధర్ముడు జననంబైనాడు. (అనుమట్టు)

అదుగో గురుపదమెంతనిదెల్పుదు బంతులసాలకు పడమరగా గదిగది నందున కదలకనిలచిన మదిలోనున్నది మాయజగం ॥బదిగో॥ నదులుమూడును గదికిన చోటను వదివిథముల నాదమునువిను పదపడి పారెడి పామరపశువుల సదనము లేకనె చెలగునది ॥అదు॥ తెల్లని యెఱ్ఱని నల్లని రూపుల కల్లజగంబును గాననిదీ కోమలి రూపముకొంచెము దీపము శ్యామలరూపము లోనిదదీ ॥అదు॥ నామమునీమము నీచులకామము నామనసొచ్చిన నాటకము జరుగువెంకటా యోగినిజేరిన తరుగు లేకనే దొరకునదీ ॥అ॥

## నాట - ఆది.

బహుగు బాపలేమొందురా యీయడవిలోన పశుచుకూతలే బందురా తడబడి నిదురలేచీ వడిగాను నీళ్ళుబోసి కడిగీ కడిగి బూడిదబూసేరేమిరా ॥బ॥ కులము కలుములెంచి బలము ఫలము ద్రుంచి జలముదోయకాకే చచ్చేరు యీయడవిలోన ॥బ॥ వనితాసుతులజూచి పనిబూని పరుగులెత్తి గనగానకాలుచుందూరు యీయడవి లోన ॥బ॥ ధనము ఘనముజూచి వనమూలో కోతిరీతి వనితాసేవాలు సేతురు యీ ॥బ॥ అనయాము తెలిపీన విసయామైనబోధాను గనకాగాడిదలయ్యేరు ॥యీ ॥బ॥ యీశా వెంకాటదాసా పోషకుడైనగురు దాసులైదోసిలొగ్గరూ ॥యీ ॥బ॥

## శంకరాభరణం - ఆది.

ఒకప్పుడు మహానవమికి చి. రామిశెట్టి దాసయ్యకు గాను వ్రాశినది.

సద్గురు రహస్యము చాలగజెప్పెద సాధులువినరన్నా మద్గురుబోధనునేవిన్నా. శివాయని నమః యనియున్నా సద్గతిజేరును దుర్గతిబారును చిఖీయనరన్నా వోరన్నా ॥స॥ కొమ్మలుమూడు రెమ్మలుఅయిదు మ్రానువక్కటన్నా కొరినవ్రేళ్ళ లేవన్నా కోటికిపొనలు సాగునన్నా కమ్మనిపూత పూయునన్నా నెమ్మదికాయాలు మాటలాడునూ కొమ్మకెగలన్నా వోరన్నా ॥స॥ వృక్షముఖన్నా పూడలు

యెనిమిది పక్షములేదన్నా దానికి శిక్షలులేవన్నా తనంతటపక్షైపోనన్నా దక్షిణ దేశముదగ్గర మొలచును దాటిపదండన్నా వోరన్నా ॥స॥ పచ్చనిపూతది పారుటాకు లది పాలేలేవన్నా వెచ్చనినీళ్ళుగారునన్నా హెచ్చినకూతగూయునన్నా పుచ్చిన పురుగులుండునన్నా విచ్చలవిడిగా నూరిబైటనే విడెదిసేయునన్నా యోరన్నా ॥స॥ విత్తులు యిరువదియైదైయుండును పొత్తుకురావన్నా మెత్తనిమన్నురాలునన్నా బిత్తరిచూపు జూచునన్నా క్రొత్తదికోటకిరాదన్నా సత్తుచిత్తులకు సాధ్యముగానిది సాంఖ్యసూత్రమన్నా యోరన్నా ॥స॥ చెట్టునుదెలియని చెడ్డమనుజులకు చేటుతప్ప దన్నా పట్టినపట్టువదలకన్నా వట్టిదివోడువిశ్వమన్నా గట్టిదిచెట్టు యెక్కరన్నా దిట్ట ముగాను వెంకటయోగిని తెలిసిబ్రతుకరన్నా యోరన్నా ॥స॥

జంజోటి — అట.

కన్నుదెరచిన కన్నుమూసిన తిన్నగానేయున్నది కన్నవారికి కన్నులోనే తిన్నగా గన్పడునదీ ॥క॥ దేశవేషములన్నిజూచియు దేవుడై తానున్నదీ దాసజనులకు దాసురాలై దాతగాకనెయున్నది ॥క॥ పాటబాడుచు నాటలాడుచు కోటలోగాయున్నది తోటలోపలి తాటిమొద్దులా తేటగానేయున్నది॥క॥ గంగయమునలు గూడుచోటను గట్టుమీదనేయున్నదీ రంగుజూచినదాతలకు తానంగమేమియులేనిది ॥క॥ వీనులం

దున నాదములువిని భానుతేజంబైనదీ కానికూతల కామపోతులు కాటిపాలా నన్నదీ॥క॥ జరుగు వెంకటయోగిజూపిన జాడలోనేయున్నదీ మరుగు దెలశిన మాయ నెల్లను తరిమివేశెదనన్నది ॥క॥

కళ్యాణి - ఆది.

మతస్థులైతే ఘటములోనుండే పటమును దెలుసుక చూపునయా తంటల మారి కొండెకుక్కలకు తత్వజ్ఞానంబేమిటయా ॥మ॥సాధుజనులకు సాగిలి మ్రొక్కుచు నాదబ్రంహ్మం గానరయా బోధాబోధలు భేదాభేదము బ్రహ్మజ్ఞానము దెలియరయా ॥మ॥ బ్రహ్మమునెరిగిన బ్రాహ్మలకెల్లను బహుగాదండంబెట్టరయా బడాయి చదువుల భ్రమలోమునిగే లడాయికూతలు మానరయా ॥మ॥ శాస్త్రముచదివే పండితులెల్లను వాస్తవమడిగితె చెప్పరయా మేస్త్రీమైన యీయేడుమేడలకు వాస్తు జెప్పునరుడెవ్వడయా ॥మ॥ తాతలుముగ్గురు తండ్రులైదుగురు మాతలు డెబ్బది యిద్దరయా వాతలు తుడిచిన దాతలకందక వాగుమీదనేయున్నదయా ॥మ॥ రంగులు అయిదు రాజులుయేడూ పొంగులుమూడై పారునయా అంగములోపలి వంగమునెరిగిన వెంకటయోగిని జూపరయా ॥మ॥

కాంభోజి - ఆట.

హంసాలనిలగట్టిచూడు దృక్కునిల్పి సంశాయములనెల్లవీడు హంసాదృక్కులబట్టి మనసూగురిగబెట్టి హింసలేకనుపరము హంసవయ్యేదవాహా॥ హం॥

శ్లో॥ హంస హంస పరంహంస సోహంహంస సోహంహంసః హంస హంసేతియోభ్రూయో ధ్వంసోనామ సదాశివా ॥సం॥ ఆధారమున విఘ్నపతికి ఆరునూరాలు స్వాధిష్టమునకారువేలు రంభాలోలునకారు వేలు రుద్రునకారువేలు జీవునకొక్కవెయ్యి హంసలనిచ్చి ॥హం॥ శ్లో॥ షట్శతాని గణేశాయ షట్సహస్రం స్వయంభువే విష్ణవే షట్సహస్రంతు షట్సహస్రం పినాకినే సహస్ర మాత్మనేచైవ సహస్రం పరమాత్మనే సహస్రమేకంగురవే అర్పయామిజపం కృశం ॥సం॥ అజ్ఞేయమున కొక్కవెయ్యి ఆవలనున్నా ఆనందగురునకొక వెయ్యి అతిభక్తిగలిగి సేవారాధించియు మోక్షద్వారమందుననిలచి దారీదెలసిజీవా ॥హం॥

శ్లో॥ దేహేతుపశ్చిమేభాగే వీణాదండాఖ్య దేహభృత్ దీర్ఘాస్థిమూర్ధపర్యంతం బ్రహ్మనాడీ ధికద్యతే ॥సం॥ ఆధారమున యోగగణపతికి లక్ష్మీపతికి వేదశైలతనయాపతికి వేదపతికి తత్వపతికి తనువుపతికి యిరువదొక వెయ్యారునూరు హంసలనిచ్చి హం॥ శ్లో॥ షట్శతాని (అను శ్లోకము) ॥సం॥ ఆడుచుండును మింటజూడు

హంసలుజోడు వేసుకుంటునే జోడుగూడు యేడులోకములాలో నెదు రేమియును లేక పాడుచున్నది పరమమంత్ర రహస్యమునీలో ॥హ॥

శ్లో॥ శరీరంవ్యాపకంవ్యోమ భువనాని చతుర్దశః నిశ్చలో నిర్మలో దేహి సర్వ వ్యాపీనిరంజనాః ॥సం॥ నాదాముపలుకు నానాదూ బోధనుగూడు వాదబేధములన్నీ పీడు ఆదిపరంజ్యోతి యానందముగవెల్గు జ్యోతిరూపుందునమనసూ జోకొట్టినిదురించూ ॥హం॥ ॥శ్రు॥ అనాహతస్య శబ్దస్య తస్యశబ్దస్య యోధ్వనిః నాదస్యాంతర్గతంజ్యోతి జోతిరంతర్గతంమనః తన్మనోవిలయంయాంతి తద్విష్ణోః పరమంపదం తైత్తిరీయోపనిషత్ ॥సం॥ మనసూ చెదరకనిల్పివేసూ మాయనువీడి మండాలముల నెల్లచూడు మండాలములమీద మహానీయముగ వెల్గు పండు వెన్నెల బయలుపరమాత్మగనుపించు॥

శ్లో॥ వివిక్తదేశఆశీనో విరాగో విజితేంద్రియః భావయేదేకమాత్మానం నిర్మలాకాశవత్యధా ॥సం॥ వెలిగేటివెలుగూలమించు పరమునుగాంచు వెలిగీన తెలివినసించూ వెలిలోనుపూర్ణమై జగముదేహములేక నలరూచుచునున్నది అదుగో మోక్షముజెందూ ॥హం॥

శ్లో॥ యదేకంనిష్కళంబ్రహ్మ వ్యోమాతీతం నిరంజనం అప్రతర్క్యమవిజ్ఞేయం వినాశోత్పత్తివర్జితం కారణం యోగనిర్ముక్తం హేతుసాధనవర్జితం హృదయాం

బుజమధ్యస్తం జ్ఞానంజ్ఞేయస్వరూపిణం కైవల్యంకేవలంశాంతం శుద్ధమత్యంతనిర్మలం నిర్గుణంపరమంజ్యోతి రప్రమేయమనుత్తమం ఆద్యంత్యరహితంసూక్ష్మం శివమద్వయిత మవ్యయం యజ్ఞాత్వాముక్తిమాగచ్ఛే తజ్ఞానం బ్రూహికేశవా ॥సం॥ నీలో బ్రహ్మము పండియుండు వేంకటయోగీనిండి ప్రకాశించుచుండూకీలుదెలియకమాయా జాలములోజిక్కి చాలాజన్మములాకు మూలామైచెడిపోకుమా ॥హం॥

శ్లో॥ ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణి సర్వంప్రతిష్ఠితం తస్మిన్ త్సర్వగుంసర్వతోముఖం తస్యామధ్యేగతాసూర్యా సోమాగ్నిః పరమేశ్వరః భూతావిలోకక్షేత్రాణి సముద్రాః పర్వతాశిలాః ద్వీపాచ్ఛనిమ్నగావేదా శాస్త్రవిద్యాకళాక్షరం సర్వమంత్రపురాణాని గుణసత్వద్వయోపిచః బీజంబీజాత్మకస్తేషాం క్షేత్రజ్ఞప్రాణవాయువఃసుషుమ్నాంతర్గతంశ్వం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితం నీలతోయదమధ్యస్తే ద్విద్యుల్లేఖేవభాస్వరః నీవారశూకవత్వన్వీ పీతాభాస్వచ్ఛణూపమా తస్యాశిఖాయామధ్యే పరమాత్మవ్యవస్థితః అంతర్బహిత్య తత్సర్వం వ్యాప్యం నారాయణస్థితః ॥సం॥

కళ్యాణి - అట.

జో జో యనరా జననం మరణం మరణం జోహమ్ ॥జోజో॥ పూహాలు

బూని నీసోహాముగనుగొని యేంహ్యామనీమెంచి సాహాసపరుడనై ॥జో॥ వచ్చే గదరా మరణం మరణం మరణం వుచ్చులువూడిపోయేగదరా జీవానం జీవనం జీవనం వుచ్చులూడకమునుపే వురిబోసిబిగియించి గచ్చుజేసి దానిరాణివాసముజేరి ॥జో సిగ్గువిడరా చీకటి చీకటి చీకటి సిగ్గునువిడచి భగ్గుమనరా ఒక్కటి వక్కాటి యొక్కాటి ముగ్గుబాయకమునుపే మూటిలోకనుగోని దగ్గరున్నభామదరిజేరి పవళించి॥జో॥అన్నావిడరా ఆయాసం ఆయాసం ఆయాసం ఆత్మనుదెలసీ అన్నానసరా ఉశ్వాసం నిశ్వాసం ఉశ్వాసం పన్నాగభ్రూమధ్యా తిన్నాగజూచితే వన్నెమీరిన చిలుకాలన్నీ నీవై తెలసే ॥జో॥ మానవలేరా మందమా మచ్చరం మచ్చారం మించినదాన్ని గాంచావలెరా అందామా వుత్సావం వుత్సావం పూనిత్రికూటముంగో నానిత్యానందా గానాములో దశనాదములనువిని ॥జో॥ రాగమువిడరా రోగమై చెందూను చెందూను సద్గురువాక్యం బాగావినరా భోగామై పొందూను పొందూను రాగభోగములాను రాణించితెలశీనత్యాగీ యోగానంద భోగీవెంకటయోగి ॥జో॥

నాదనామక్రియ - అట.

నన్నుతాంగీ నీసరసకురాను వన్నెకెక్కినవాడను నై కుంతుడను॥స॥ రాజులేనట్టి రాజ్యములోను రాజయోగినై రాజ్యమునేలుచునా...॥స॥ వున్నవా స్తవము తెలి

యాజెప్పెదను నన్నుగన్నవారికి కన్నులోనేయున్నాను ॥స॥ దున్నపోతుల కందకబోను దారితెలియని దుర్మార్గ దాతఁగాలేను ॥స॥ పట్టిమంచం పరుపులన్నీ పాడు పుట్టిగిట్ట తుండేవాడు తోడైయున్నాడు ॥స॥ నిన్నుజూచితే నీవు నేగాను నన్నుజూచేటి చూపులో నేనేయున్నాను. ॥స॥ తొంగిచూచి తొలగిపారిపోవే తోడుతోడైనవానికి జోడుననుకోవే ॥స॥ భాసురాంగి నీభయమూలోలేను బుద్ధినెరిగిన వెంకటయోగినైనాను ॥స॥

భైరవి – ఆది.

మేనుమరచి చూడరా నేనేబ్రహ్మామనుచు తెలశీ ॥మే॥ తాను నేనానాకనిండి నిర్వికల్పమైనసన్ను ॥మే॥ అంతాటా నేనుంటిరా. అంతుదెలియ నెవ్వరితరము ॥అం॥ ఆత్మనాత్మనెరిగి ప్రత్యగాత్మనైయున్నట్టినన్ను ॥మే॥ యండవానగానురా అండనాదు సర్వమునకు ॥యెం॥ అండపిండ బ్రహ్మాండములన్నీ నాలోఅయిక్యమౌను ॥మే॥ యెరుకాబయాలునేనేరా యెవరివశము నన్నుదెలియ ॥యె॥ యెరుకబయలై యేమీలేక యేకామైయున్నట్టినన్ను ॥మే॥ నిత్యామైనేనుంటిరా సత్యమైన నన్నుదెలియా॥ని॥ సత్యమైనవెన్నెల ప్రత్యేక్షమై పరిపూర్ణమౌను॥మే॥ నిండీ పండీ యుండారా యీసీటి బుగ్గ మరుగుదెలశీ ॥నిం॥ దండివెలుగై దాటి మిగిలాఖండమైయున్నట్టినన్ను ॥మే॥

శంకలేకనమ్మరా శ్రీశంకరుడనైన నన్ను ॥శం॥ సంకటములులేక జరుగువెంకటయోగైననన్ను ॥మే॥

### నాదనామక్రియ — అట.

నాదుగోయన్నా రోయన్నా పాదులేదన్నా లేదన్నా పాముగాదన్నా కాదన్నా గోదావరీలోన గోపాలకృష్ణుండు గోంగూరలేకనే కొట్టుకున్నాడంట గోరన్నా ॥నా॥ గంగాయమునల నడుమ రంగైనమేడలో పొంగుచున్నానని పొగనుబట్టిన్నావురోరన్నా ॥నా॥ నాజాడదెలియకా నిన్నుగానగలేక యేజాడదెలియకీబాజారుజేరేవు రోరన్నా ॥నా॥ రాజయోగంబునకు రాజైన వెంకటయోగి జెప్పినమాట భోగమేనని నమ్మరోరన్నా ॥నా॥

### హిందూస్తానికాపి — అట.

హోయి హోయి సదానందా పాహీ ॥హో॥ నీవుచెప్పినజ్ఞానము చోద్యమేమోయి॥హో॥ నేను నేనే నేనే నంటి నోయీ నేను నేనే నేనే నంటే కాదంటివోయి నీవు నీవే నీవై యుంటివోయి నీవు నేను యేకంబైతే యేమిలేదోయి ॥హో॥ మాయ మనసు జేరినదంటివోయి మాయ మాయము కాగానేమరి యేముందోయి బోయవాడే వాల్మీకంటివోయి మాలవాగున వశిష్టుని భార్యాగదోయి ॥హో॥ మాదుగ్రుడ్ల

పక్షినంటివోయిమూడుగుడ్లపక్షికాళ్లయిదంటివోయి కాలుకాలు కై దేళ్ళంటివోయి బాటనడువను యొక్కవేళే చాలంటివోయి ॥హా॥ యీదరాదు యిలయేరంటివోయి యీదే యీతగాండ్రుదండర్ని కాదంటివోయి పాదుపెకలించి పశుమంటివోయి నాదు పదివిధములుగాను వినుమంటివోయి ॥హా॥ మూడుమూర్తులు లేవంటివోయి మూడు మూడు విడచి ముక్తిగనుమంటివోయి జోడులేరు వెంకటయోగినోయి బాటజూడు ముఖ్యముగ్గాను ముక్తికిబోయి ॥హా॥

భైరవి - ఆది.

కోమలాంగి కోటిసూర్య కాంతినచటాగంటే నే ॥కో॥ భామాయేమోగానీ భయము బాగాజూడానైతేనే॥కో॥ ఉక్కానణచి ప్రకాకాబరచీ చక్కజేసి చూడావే బాలాయిదియే చాలాకలిగేలిలా ఆపోజ్యోతియా॥కో॥ అమ్మాధరలో బొమ్మలాట నమ్మరాని నాట్యామే సోహం సోహం సోహంబనుచూ చొచ్చివచ్చీ తిరుగూనే॥కో॥ మెరుపు తెలుపు నలుపులోన మెరుకచాలా మెరుపేనే జరుగువెంకట యోగిలోనూ పరుగులెత్తుచున్నాదే॥కో॥

నాటకురంజి - అట.

ఏమందునేమందును సద్గురురాయాయేమీలేదనుచుందుచూ యేమందుస్వామి

నేఖామందుననుకుందూ ఆమందమతినొందనూ సద్గురురాయా యేమీలేదనుకుందు నూ ॥ఏ॥ దేవుడేలేడందునూ దేవుడుంటే దేహమేకాదందునూ దేహిదేహములా లోదేవుడున్నాడని దేశికుడైయుందూనూ సద్గురురాయా యేమిలే ॥ఏ॥ చింతా వింతల జూడనూ సంతనదెలశీ రంతూలువినబూనను గంతులువేయుచు యింతి బాడెడిపాటా నంతాలోకనుగొందునూ సద్గురుయేమి ॥ఏ॥ పాతాకులను బిలువాను బ్రహ్మజ్ఞాన వ్రాతవారినెగందూను దాతానెనుగక మాలవ్రాత వ్రాశినగ్రంథంమూత దెరచి చూడనూ సద్గు యేమి ॥ఏ॥ ఏడూకొండలనెక్కనూ అడవులుబట్టి ఆకూలు తినజాలనూ యోగాభోగములాతో యేటివాగ్గుకు జేరి యేకాంతమునునుందునూ స॥ ॥యే॥ ॥ఏ॥ బెందరుపురమునుండి బంగరుపిట్టా బయాలూ జేరిసదందూనూ ఎందాకదిరు గూనో యేమేమిజేయూనో యెరుగకుండగానుందునూ సద్గు యే ॥ఏ॥ దాసోహం దాసోహమో దాతానీకు నేసోహం నేసోహామూ దాసా వెంకట యోగీ వేషాసద్గురు వేషా భాషామరువకయుందునూ సద్గు యే ॥ఏ॥

ముఖారి - ఆది.

సమాధి యోగమిదుగోరా ఆనందభోగమిదుగోరా ఆనందభోగమిదుగోరా సచ్చిదానంద మూర్తిని, సేవించీసౌఖ్యమొందినా నేనానిఅయిక్యమొందినా ॥స॥

పత్తూలానరసికట్టారా పరమూనా మనసుబెట్టారా శిక్షించిమాయనిట్టారా గుణములా తరిమికొట్టారా ॥స॥ ఎండమావులూ నీరుగా నెండీన స్థాణుపురుషుగా గ్రొడాలుగాంచుబిడ్డాగా యుండేటిజన్మముల్ బాపే ॥స॥ శ్రీకృష్ణరామలక్ష్మణా శ్రీయాంజనేయులార్జున శివాదియోగబృందములూ సేవించిసౌఖ్యమొందీనా ॥స॥ నిత్యామునిష్ఠసల్పారా నిర్మాలాజ్ఞాని వాదువురా సత్యమైస్వామి వెల్గూరా నేనానిఐక్యమొందరా ॥స॥ చక్కాగాశివునిగొల్వారా వెంకటాగురునిజేరరా ప్రక్కాలోమాయవీడరా నిక్కాముజగములేదురా ॥స॥

నాదనామక్రియ - అట.

అదియేమిచిత్కళో అంతింతయనరాక యెంతమంటుఃమండెనోరి అంతలో నన్నృతము ఆదిపొంగులుపొంగి యెంతలోచల్లారెనోరి ॥ఆది॥ అద్రిపైనున్నట్టి ఆత్మను దెలియుటకు ముద్రలక్కరలేదురోరి భద్రముగ సద్గురుని శ్రద్ధగాగొల్వరవ్వంతలో జూపురాయోరి ॥అ॥ సంతనలుదెలియకను సాదులనుకూసేటి వాదుకూతలు మానరోరి అంతుదెలియని నరులయాత్మలోనుండి చీమంతైనగనబడమరోరి ॥అ॥ నాదమును గనలేని బాధగురువులుజెప్పు బోధ నమ్మగబోకురోరి సాధనేమియులేక సద్గురుని జూపేటిస్వాములను జేరరాయోరి ॥అ॥ ఓసమూలెరుగని వోటిగురువులబట్టి

వోడించెదనుచూడరోరీ చాలగాతనలోన గానమును జేసేటి చానయెవ్వాతో చూడరోరీ ॥అ॥ దేహిదేహములలో దేవుడైయుండేటి దివ్యమూర్తిని జూడరోరీ వాహనంబులమీద వరుసగానున్నట్టి సాహసముదెలియరావోరీ ॥అ॥ ఎన్నాళ్ళు బ్రతికినానేమిలేదనుచు యేకాంతముకు జేరరాయోరీ వున్నవారందరూ సున్నమైపోదురూ కన్నుమూసుకచూడరోరీ ॥అ॥ దాతలేనటువంటి దయ్యాలపేటలో చేతగానీగురువులోకి మాతనెరుగని పసలరోతకూతలుమాన్పె దాత వెంకటయోగినోరీ ॥అ॥

## యాలలు ముక్తికాంతా సంవాదము.

ఎవరుమీరు యేమీకులమూ యేమిపనిగావచ్చినావూ ఎవరునీకూ దారీ జూపిరీ ఓ వెంకటయోగీ వరుసదప్పిన పనికివస్తివి ॥వెం॥ కలికినీదు కులుకూజూచీ వలిచేరివచ్చినాను అలుకలేనా అందానివ్వావే॥ ఓముక్తికాంతా పలుకువిని పరుగిడి వస్తినీ ॥ము॥ నీవువచ్చేదారీలోనా నిన్నుద్రింగేయెలికున్నాది నీవుమెట్లాదాటీవస్తివి ఓవెంకాటాయోగీ జీవభావము జిమ్ముకుంటీవి ॥వెం॥ నిన్నేనేను నేర్పుతోడా పన్నుగానూ పిలువా పిలువా వన్నెకెక్కిన పిల్లివచ్చేనే॥ ఓముక్తికాంతా కన్నెయెలుకా కరకరలాడేనే ॥ము॥ యెలుకదాటీరాగాపెద్దా యేపెద్మూకులవనమున్నాదీ పలుకరించే పులులేవున్నావీ ఓవెంకాటాయోగీ పులటలదాటీమెట్లావస్తివి ॥వెం॥ చిలుకనీదు

ములుకు పేరు అలుకలేకాకలువారించా తళుకు తళుకున మాటలుముండేను ఓముక్తి కాంతా చిలుకబోయ్యే నందూవోరికేను ॥ము॥ సందులోనిసంగతిజూచీ యందు లోనే అంతావిడచీ యిందుజేరినపనికిరావోయి ఓవెంకటయోగీ సందుగొందులు తప్పక చూడోయీ ॥వెం॥ అందరాన్ని మానిపంచూ ఆటలాకు అందాదని ఎందు నెందున మెంచీచూస్తినే ॥ఓ॥ ముక్తికాంతా అందునిందున నెందునున్నావే ॥ము॥ యోగియోగి త్యాగీననుచూ భోగములలోపుట్టిచచ్చే రాజులాకు జాగాయివ్వాను ఓవేంకటయోగి జోగివైతేబాగాపొందేను ॥వెం॥ నిన్నజూచేచూపులోనా కన్నుజెదరీ కాను పైతీ కన్నకడుపు కాలిపోయేనే ఓముక్తికాంతా విన్నమాటపదిగాపగిలేనే ॥ము॥ ఆత్మరామా అయ్యానిన్నా అడిగెదాను అమ్మాపెరు తండ్రియెవరో తెలియా జెప్పరా ఓవెంకటయోగి అల్లిబల్లియాడుదామురా ॥వెం॥ కన్నతల్లి శ్రీమహాలక్ష్మి యెన్నతండ్రి రఘునాయకులూ పున్నపేరూజరుగువారేనే ఓముక్తి కాంతానీచిన్ని పేరు వెంకటయోగేనే॥

సురట – చాపు.

మంగళము శ్రీముక్తి కాంతకన్యకుజయ మంగళం సద్గురుస్వాములకునూ జయా మంగళము మాయాంధకారంబు నెడబాపె సంగ తెరిగిన సాధుపుంగవులకూ ॥జయా॥

జయ మంగళం సదా శుభమంగళం॥ మూడుజలధులుదాటి ముక్తి కాంతనుసాటి మూడుమూడునుమీటి జాడనాటి బాడవల్బ్రమలేక పాడుజేసినయేక మాడము గయునుగాని జాడఁ పుట్టు॥జయా జయమం॥ యండగాచినమంట పండువెన్నెలవెంట అండలేనిచోటనుండునంటా నిండుగానిదిజూపు దంసిగురువులజేరి పంసినిండిన పరమ యోగులకునూ ॥జయా॥ వాటమౌయీకోట పాటబాడినమాట యేటివొడ్డును జేరి బాటనాటా మాటనమ్మినవారి మూటగాబోవుకట సాటిలేనిపరమ మేటులకునూ ॥జయాజయ॥ యేమిజేసినగాని యేకమైనదిపూని రాముడేనే ననే రహస్యమునకూ కాముడైయెరుకనెడబాసి యొండి పండి దంసిగానెలిగేటి ధీరులకునూ ॥జయా జయ॥ వాసనలు మూడిటిని గోసివేసినముక్తి వానవెంకటయోగి బాసనమ్మీగాసిబాసియు దివ్యరాసిజూచినభవ్య వాసులౌవైకుంఠ దాసులకునూ॥జయా జయమంగళం॥సదా॥

## మంగళహారతి.

మంగళం ఓంకార మంగళం నమకార మంగళము శివకార మంగళముయా మంగళం సిధంనమఃకార మంగళము మంగళము అఆల ఇఈలకూ ॥జయాజయ మంగళం సదాశుభమంగళం॥ మంగళము కఖలకును మంగళము చఛలకును మంగళము టఠలకును మంగళమణామహా నియ్యమంగళము తథదధాలకు మంగళము పఫ

బభామాంకిపుడు ॥జ॥ మంగళము సురలవా మంగళము శషసహా మంగళము శక్షాఆఇతీలకు మంగళము మహాదేవ మహానిత్యామూర్తులకు మంగళము మాగురు స్వాములకునూ ॥జయాజయ॥మంగళము వేమన్న మొదలైనయోగులకు మంగళము మద్గురుపుశిష్యులకునూ మంగళము మహాదేవ మహానిత్యాముద్రలకు మంగళము రవిచంద్రకాంతులకునూ ॥జయాజయ॥ మంగళము నభమునకు మంగళము వాయువుకు మంగళము అగ్నిజలభూములకునూ మంగళము పంచవింశతితత్వములకునూ మంగళము మాయఘటశోధనకునూ॥జయా॥మంగళము ఆత్మకును మంగళమ నాత్మకును మంగళము మహానీయమతములకునూ మంగళము రాజయోగుల గృహంబులకునూ మంగళము ధర్మకర్మంబులకునూ ॥జయా జయ॥ మంగళము దుష్టులకు మంగళము శిష్టులకు మంగళము చెడుయుక్తివాదులకునూ మంగళము పురుషులకు మంగళము స్త్రీలకును మంగళం బీచరాచరములకునూ ॥జయా జయ॥ మంగళము తల్లికిని మంగళము తండ్రికిని మంగళము నాతోడబుట్టువులకూ మంగళము ముష్కేఫరీద్ మహానీయునకు మంగళము జరుగువేంకటయోగిచే ॥జయాజయమంగళం నిత్యశుభమంగళం ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇంతవరకు శ్రీగురుస్వాములవారిచే వ్రాయబడినవి. ఇటనుండి యస్మత్కృతంబులు.

ఓం

శ్రీమజ్జరుగు వేంకట సద్గురుపరబ్రహ్మణేనమః

శా॥ శ్రీమద్వేంకట దేశికాంఘ్రియుగళం శ్రీదమ్సదామోదదమ్
నానాదుఃఖనివారణమ్ సుఖకరమ్ నారాయణం శంకరం
సత్యాసత్యవిలక్షణంచ విమలం సర్వాంతరాత్మేశ్వరం
కామాద్యంతరశాత్రవాపహరణమ్ కారుణ్యకైవల్యదమ్
సోమార్కానలనేత్రమచ్యుతమహం బ్రహ్మాదిహృద్గోచరమ్
ప్రేమాకారమశేషలోకజనకం ప్రజ్ఞానరూపంభజే

గేయము॥ ప్రజ్ఞానదాతారమీశం సురేశం ప్రత్యగ్రతిమిరార్క ప్రణతోస్మినిత్యం పంచవింశతితత్వ సాక్షిస్వరూపం పంచభూతాతీత ప్రణతోస్మినిత్యం మాని మానసభృంగ మాత్మస్వరూపం బ్రహ్మాండసాకార ప్రణతోస్మినిత్యం భేదవర్జిత నిత్యప్రేమస్వరూపం పరిపంథిగణకాల ప్రణతోస్మినిత్యంజరుగు వేంకటసుగురుసామీ పరశం భక్తవత్సలదేవ ప్రణతోస్మినిత్యం ధరణి గాజుల రామదాసాఖ్యపోషం పరమేశ మాంరక్ష ప్రణతోస్మినిత్యం.

శ్లో॥ జరుగుకులాంబుధిసోమం బుధజనహృదయాంబుజధామం
దుర్జనశాత్రవ భీమం జయజయ దూరీకృతకామం
వరకరుణాంబుదశ్యామం నిజభక్తజనోద్ధర నీమం
పరమపదాత్మారామం మాంపాలయ గురు దాసోహం

శ్లో॥ కార్యకారణ కర్తృత్వం సర్వకర్తృత్వసంయుతం
భక్తవత్సలదేవేశం వెంకటేశమహంభజే

శ్లో॥ సర్వబ్రహ్మాండ సామ్రాజ్యం ధర్మకర్మ వివర్జితం
సృష్టిస్థితిలయాద్యాదిమ్ రామదాసాఖ్య పాలకమ్

మత్తకోకిల॥ భుక్తిముక్తిఫలప్రదాయక భువనవందితశ్రీవరా
శక్తియుతసుగుణాకరా బుధసేవితానిఖిలేశ్వరా
రక్తినొసగు భుజంగభూషణ రాజమకుటపరాత్పరా
భక్తవత్సలవెంకటేశ్వర పాహిమాం సద్గురువరా

మత్తకోకిల॥ భాసమానకైలాసనివ్వయ భద్రగుణ గణశోభితం
వాసవాదిసురార్చితం పరమేశ్వరం మమ ఈప్సితం

ధీనమంచితనిత్యసత్యనిరంజనం ఖలభంజనం
దాసపోషక వెంకటేశ సదాముదం భజదేహిమే

నాటకురంజి - అట.

శ్రీగురురాయా దాసోహం భవరోగభిషగ్వర్యాపాహివందేహం ॥శ్రీ॥ ఆగమస్తుత్యా సంతతమానికృతకృత్యా యోగీశ్వరాయ ఓమ్ నమోశివాయా ॥శ్రీ॥ నేతినేతీతి వాక్యార్థరీతి బోధకరుణనించి ప్రీతియొనరించీ చేతోసమ్మోదముబెంచి నీతిదూరత తోనే గోతింబోబడకుండా ఈతనేర్పినజ్ఞానదాతా వందేహం ॥శ్రీ॥ మాటిమాటిని త్రోసివేసి పదమాటిమాటినిబట్టి మటుమాయజేసీ హాటముతో ననుజేరదీసి చిటికెలో ఘటమనేపటమునుజూపి యీకిటుకుదెలిపిన సత్కీర్తీవందేహం ॥శ్రీ॥ ఎల్ల లోకములేలేదేవా కలకల్లలయియ్యల ఝల్లగాజేయుదీవా తల్లిదండ్రియు సర్వమీవ ముల్లోకములకాది మూలకారణమైనట్టి కొల్లగానేలేసద్గురవేవందేహం ॥శ్రీ॥ పంచవింశతి తత్త్వాతీతా యీ ప్రపంచమూలాభావమెంచిన ధాతా సంచిత మత్పుణ్య ప్రాత వంచనున్నభక్త సంచితాగాముల ద్రుంచి ప్రేమించే విరించీవందేహం ॥శ్రీ॥ అందునిందును నెందూనీవే ముందు సనకసనందనానందుడవీవే మందమతులకందబోవే సుందరాకారా నాడెందమందుననిలచీ సందేహములదోలే సాక్షీవందేహం ॥శ్రీ॥

జరుగువేంకటస్వామివేషం దీనధరను గాజుల రామదాసాఖ్యపోషం పారమార్థిక బుధతోషం ఘోరదురిత దుఃఖదూర (దూరీకృత మేరుసమాన దుష్కాలుషం)
వందేహం ॥శ్రీ॥

శంకరాభరణం - ఆది.

భజేదేశికేంద్రం సదమలమహాదయాసాంద్రం॥ అజాదిసురసేవ్య మున్విమలముగ అజాండరూపాఖిలాత్మకంత్వాం ॥భ॥ సదానందమూర్తి మామకసుధావిమలకీర్తి విదారణాఖిలయఘా పరాత్పర ముదందేహిమే ప్రభోజయతుజయ ॥భ॥ జరామరణదూరం భవరిపుమదాపహారశూరం నిరాకారముగ నిరంజనంబుగ అవాఙ్మానసం బగోచరంత్వాం ॥భ॥ సోమసూర్యనయనం గాజులరామదాసమననం కామరాగతామసాదిహననం నామరూపరహితం సుదర్శనం ॥భ॥

శంకరాభరణం - ఆది.

నీలమేఘశ్యామ రంగబారో అనుమట్టు.

భజేగురునాథం గురునాథం గురునాథం నాథం విజ్ఞైభవాశాశ్వితామృత మహాబోధం గురునాథంనాథంగురునాథంనాథం॥భ॥ విదళితఖేదంవిమలసుగాధంహ్లాదయానంద దాతృత్వం నమస్తేస్తుత్వం ॥భ॥ సుందరాకారం సూనృతసారం సూరిజన

మందారం జయగురువీరం ॥భ॥ ఖలజనశోషం కమనీయవేషం విలశితమృదుభాషం సదాసంతోషం ॥భ॥ నిత్యానందం నిజగోవిందం భృత్యబ్రహ్మానందదం పోషితముని బృందం ॥భ॥ సకలలోకేశం త్రిపుటీప్రకాశం వికశితయుపదేశం దూరీకృతనాశం ॥భ॥ జరుగుకులేశం పరవెంకటేశం ధరగాజులరామదాసార్చిత విబుధేశం ॥భ॥

దర్బారు—అట.

ముక్కూమూయని గాలిమూటానాకుజిక్కె సద్గురునాథుబాటా చిక్కులు బెట్టి యీప్రక్కాలోగలదాన్ని నిక్కచూడక గురునిప్రక్కానె యున్నాను ఎక్క డెక్కడ వెదకనాయీటక్కులాడిగానుపించనుసక్కకుక్కలనొక్కపరిగాచక్కగాదిగ ద్రింగమిగిలిన ॥ము॥ మూటాకెన్నెన్నిఘారాలూ చేరవాటాముగాని గుణ్ణాలుబాటా డెలియనీక మోటూవానిగజేసి ఘాటీగననుబట్టి యేటీలోబడవేసి మాటిమాటికి ముంచెనట ఆపాటులిన్నని మెరుగనైతిని సాటిలేనీమూటవొరుకగ మేటినైనేనుంటి నహహా ముసలిముండెన్ని రంగులకీ వట్టిపసరంబులకుబల్ గారడిది కనపూమేపుటకై యీపసలగాపరితొత్తు దశదిశలనునిండి వశముగాదు మొండి పసయొకింతయులేదు దీనికి రసికులను కదిలించలేదిది కుసుమశరుడొకదుండెనను నరపశువులకు వశమౌన కాదిది ॥ము॥ తోలిఘారా కార్గురున్నారూ వీరేకిలిమాయకెల్లకారకుల్గూ తలబోడి

కేసూకనిలచీనగాని బల్ములుకూలనొప్పించి వలికీపాల్ జేతూరు తులవలకువీరలను గెలువగనలువకైనను వశముగాదట నిలచుటకునీడైననోసగనిఖిలశిఖామణులార భళిరా ॥ము॥ తరుగాకపారు మూడేర్లు యీదతరముగాదు యీమూడేర్లు హరిహరా దులకైన నలవిగాదివి యీదనరులెంతవారిట్టిదురితాంధకారభాస్కరుడుజడుగుకులాబ్ధి చంద్రుడు పరముడౌహరి వెంకటేశుడు వెరువకనిశిరమందు కరమిడి వరమొసంగెను రామదాసుకు ॥ము॥

## హిందుస్తానికాఫి—అట.

నన్నేలినాడే సద్గురుస్వామి నన్నేలి॥నన్నేలినాడే యాపన్నశరణ్యుడు యెన్నరాని భవము సున్నగజేసితా ॥న॥ భావాభావములెంచి ప్రేమానాపైనుంచి చావుపుట్టుకలేని జాడలోపలనుంచి ॥న॥ తరణీందులకు మధ్యదారిలో ననుగూడి తానేనేననిపల్కి దైవరాయుడుమెచ్చి ॥న॥ వాదభేదములేని పాదునాకెరిగించి భేదాభేదముద్రించి బోధకరుణనించి ॥న॥ మూడుమేనలుగాక మొదలును తుదిలేక జోడులేని మంచిమేడలోపలనుంచి ॥న॥ అంగనామణికొంబల్ దొంగాల నదలించి శృంగాగాకారుడుష్ప్రాంగూచు ననుగూడి ॥న॥ తనుమనః ప్రాణముల్ తమవనికొనివేశి

ఘనుడునన్నొనగూడి కాదన్నావిడువాక ॥న॥ హరిహరబ్రహ్మాదులైన దెలియరాని జరుగు వేంకట గురుడు పరమదయాళుడై ॥స॥

ఆర్థకదార్థములు.

భవహర శ్రీగురుదేవా అవిరళగతిత్వత్పదంబు లనిశంబును నేదవిలిభజించుచు నుండిన అవివేకము పాగద్రోలవేటికిభవమొల్లను ముమ్మాటికి రావదేరయో దేవ దేవ మద్భావంబును రంజిల్లగజేయంవేటికి భవమొల్లను॥

మొదనీపదములనుంచుము పదమూర్తిన్ బెంపణంచిపడవేయుము నాకోదువల నవ్వాలద్రోలుము సదయాత్మా యిట్టులైనచాలును నాకదేపదివేలౌను ముదమొసంగు స్వర్గాదిభోగముల నెదదలంచి పలవించబోను చాల్ చాలును ॥నాకదేపదివేలౌను॥

శ్రీజరుగు వేంకట పరబ్రహ్మణేనమః

జరుగుకులాంబుధిచంద్రా పరమాత్మా వెంకటేశపాహిమహేశా సురనరమునినుత హారశ్రీకరుణాబుధిదేవదేవ కావవా త్వత్పాదసేవ లీయవా ధారుణి గాజుల రామ దాసుడన్ ధీరుడవని దరిజేరినాడనన్ గావవా॥ హరిహారకమలాసనముఖ సురసేవి

తమై వెలుంగు సుందరపదముల్ దరుగని తావకకృపచే నరుడగు పామరుడగు జూడ గంటి నీ తవదాసకోటినుంటిని నిరుపమానమై నిరంజనంబై చరాచరంబుల జేరక చేరుట గంటిని ॥తవ॥ వ్రతదానంబుల జపముల క్రతువుల తీర్థాగమముల గనబడ వది రామతము లసైనను జిక్కవు యతిమానసహంసా నీకే దాసోహం హాతకలుషా త్మాత్వం వందేహం చతురానన పంచాననాది సురసేవితమైన పదాబ్జంబులకే దాసోహం ॥హాతకలుషాత్మాత్వంవందేహం॥

కాంభోజి - రూపకం

నిన్నుదెలియదరమాస్వామి॥ని॥ సన్నుతా శ్రీవేంకటేశ ॥ని॥ పన్నగ గంధర్వ సిద్ధకిన్నర నరగరుడదేవ సన్నుత నీనామభజనసల్పెడి వారికెగాకిల ॥ని॥ పెక్కు మతంబుల భ్రమయను చిక్కుచీకటింజొరబడి దిక్కుగనక నీదాసుల వెక్కిరించు వెంగలులకు ॥ని॥ హరియనుచును కొందరు నిర్ హరుడని మరికొందరు భువి గురు వరుడని దెలిసికొనగ నరపశువులకలవియగునె ॥ని॥ హరిహరబ్రహ్మాదులైన నరయ గలేరనగనునిక తరమా నాబోంట్లకు నీదురవహామగు ప్రకృతివీడి ॥ని॥ మూడుగుణంబుల కందనిజాడదెలియు నీదాసులతోడగూడి భవవారధివీడి మురియు వారెగాక ॥న॥ యెక్కడజూచిన నొకటిగ దిక్కుదిక్కులన్నిండియు మక్కువతోడుత

దాసులప్రక్క వీడి చరియింపని ॥ని॥ చూడకచూచెదవో భళికూడకకూడెదవేమని పాడుమరో నీనామము భాగవతాగ్రేసరులిల ॥ని॥ అంగత్రయమందవు బహు దొంగవు నీమహిమల నిస్సంగచిత్తులేవిధమున దొంగిలిరో నినుచిత్రము ॥నిన్ను॥ జరుగుకులంబున వెలసిన పరమభాగవతుడగు రఘువరనాయకు పుత్రుండవు పరమ రాజ్యపాధిపుడవు ॥ని॥ రాజరాజరాజేశ్వర గాజుల రామునికై యీభూజనులలో నొకనిగ నవ్యాజకరుణనుదయించిన ॥ని॥

దేవగాంధార - అట.

భక్తిసేవింతామురారె సర్వశక్తిసంయుతులు శ్రీవారే యుక్తులతోను సత్పాసక్తులవచియించి ముక్తినొసంగి విరక్తులైయున్నారు ॥భ॥ మూడుమేనులుగాని వారె మొందుజోడులేకను వెల్గువారే మూడుగుణంబులజాడ గనక మనగోడులన దలించు జాడలోనున్నారు ॥భ॥ చింతావింతలులేనివారే సర్వచింతాలబోదోలువారే వంతుకెక్కెసయట్టి యంతకునదలించి పంతగించి ముక్తికాంతనొసగువారే ॥భ॥ మొంతోషింతైయున్నవారే బలవంతూలుగనరానివారే సంతోషమైన యేకాంత సేవకుదక్క రంతూలకందాని పొంతలోనున్నారు ॥భ॥ కర్మాధర్మములేనివారే పాప కర్మాలకందాగబోరే మర్మమెరిగి సర్వధర్మముల్ విడచి త్వద్ధర్మమనగ మనకర్మ

ముల్ బోద్రోలు ॥భ॥ అయిదింటికందాగబోరె ఐదైదూలకవలనున్నారే శ్రైదులో బడద్రోయు మైదుదాసరిజేయుచైదముల్ గనక నాల్గయిదింటిసాక్షిగ ॥భ॥ మూడు కాల్వలుదాటిరారె పదనూడుంటే దరిజేరలేరేమదిచుండే గురునాథుపదముల నిలుపకియ్యేదను విడచి యేలవృథపోయ్యెరయ్యో ॥భ॥ జననమరణములేని వారే మన జన్మధన్యముజేయువారే, ధనమనప్రాణముల్ ధారవోసిన వారినన యాము చేపట్టి తమరూపమిచ్చుసద్ ॥భ॥ జరుగు వెంకటస్వామివారే యింతో విరివిగ నేలుచున్నారే ధరను గాజుల రామదాసునిపై వారి కరుణామృత సువృష్టి గురిపించిరటవేగ ॥భ॥

ఇక్ష్వాకుకులతిలకా యికనయినా బలుకవే రామచంద్రా, అనుమట్టు.

కాంభోజి - అట.

భవరోగములకేమి పరమౌషధంబో శ్రీరామాచార్య దాని వివరముగా దెల్పవే నన్నుకరుణించి ॥రామా॥ పదిరెండు మాత్రలు భావించి భుజియింపకనక మాంబవదలూను భవరోగవారాశియల్లను ॥కనకమాంబ॥ ద్వాదశాక్షరిని సమ్మోద ముగంటి శ్రీరామాచార్య దీని పాదు దెలియనట్టి భావమ్ము దెల్పు ॥శ్రీరా॥ పాదు

మూలములేక బరితెంచునమ్మయో కనకమాంబ పదియారుమాత్రల భావమదిమె నుమ్మి ॥క॥ షోడశాక్షరిలోని జాడసత్యమెగాని ॥రా॥ ఇట్లు విడిబడి వాదించు విధ మేమొదెల్పు॥శ్రీరా॥పదియైదు మాత్రల భావమ్ముమదినమ్ము ॥క॥ వదలును సంశయ వనదావానలమద్ది ॥క॥ యీమందు జేసినయట్టి మహనీయ్య మూర్తి॥శ్రీరా॥ యెందున్న వారో వారెవ్వరో దెల్పు॥శ్రీరా॥ జరుగు వెంకటగురు సార్వభౌముడెతల్లి ॥క॥ హరుడు నాకొరకై తానరరూపమునవచ్చె ॥క॥ జి రామగురువర్య శివయిందురావయ్య సేతునయ్య మారాడబోక నామదిలోన నీసేవ ॥రా॥

## యెరుక.

యెరుకడుగరోయమ్మ యెరుకెమాయమ్మా యెరుకజెప్పెదనమ్మ యెరుగవే కొమ్మా యెరుకప్రభావమ్ము నేమనిపచియింతు యెరిగున్నవరకు నీకెరిగింతునమ్మా తల్లిదండ్రులు యెనుక తగుసోదరులు యెరుక యెల్లబాంధవులెరుక కల్లయీయెరుకా బ్రహ్మవిష్ణులుయెరుక భవుడెన్నగాయెరుక తరణిచంద్రులుయెరుక తారలునుయెరుకే పంచభూతములెరుక ప్రాణమ్ములాయెరుక బ్రహ్మాండపంక్తులును భావింపయెరుకే సప్తపాదోధులును సప్తశైలంబులును సప్తమహర్షులును సహజమీయెరుకే పర మాత్ముడొక్కడును భావంబదియుయెరుకె నీవునేననుటలును నిక్కమాయెరుకే పరులు

తామనునట్టి భావంబదియుఎరుక పంచేంద్రియములెరుక ప్రణవమ్ముఎరుకే షడ్గుణమ్ములు ఎరుక షట్శాస్త్రములుఎరుక షణ్ముఖాదులుఎరుక జగములుఁ ఎరుకే నాల్గువేదములెరుక నానార్థములుఎరుక యీపురాణములెరుక శేషుమాటెరుక సతిసుతులాఎరుక సంసారమాఎరుక సర్వతీర్థములెరుక సర్వేశుఁడెరుక పంచవింశతితత్వపద్ధతియాఎరుక ఎరుకనెరిగెడి తెలివినెరిగేదిఎరుకే అష్టమదములెరుక యిష్టభోగములెరుక కష్టసుఖములుఎరుక కర్మమున్ఎరుకే దశదిక్కులాఎరుక ధర్మమర్మములెరుక దానవాదిత్యులున్ దండైనఎరుకే బాంహ్యాంతములెరుక పరిపూర్ణమాఎరుక ఇంగితంబనెరుక సంగమ్ముఎరుకే రోగాదులాఎరుక రాగమ్ములాఎరుక త్యాగమ్ములాఎరుక తెగువయున్ఎరుకే॥

అవతారములుమెరుక వ్యవహారములుమెరుక అవనీపతులుమెరుకకవితలున్మెరుకే సంగీతమామెరుక సాహిత్యమామెరుక సాధనమ్ములుమెరుక సకలమ్ముమెరుకే కర్తభోక్తలుఎరుక ఆర్తిగుఁదుటమెరుక దూర్తత్వమామెరుక దోసమీమెరుక ముక్తియున్మెరుక యాశక్తిపంచకమెరుక యుక్తిసూక్తులుమెరుక రక్తియీ మెరుక ధనధాన్యములుమెరుక దంబమ్ములామెరుక వినయాదులీమెరుక వింతయీ ఎరుకా శిరియు గౌరియుఎరుక శచియు వాణియుఎరుక తిథివారములుఎరుక

దినములున్ ఎఱకే కాలమ్ములా ఎరుక శీలమ్ములా ఎరుక స్థూలమ్ములా ఎరుక సూక్ష్మ
మ్ములెరుకే కారణమ్ములు ఎరుక కార్యమ్ములా ఎరుక కర్మమా యీ ఎరుక కలదెల్ల
ఎరుకే ఇంతేలవచియింతు సంతవినుమా యమ్మ వంతుకెక్కినబోధ వాకొందు
నమ్మా పలుకులెల్లను ఎరుక భావమ్ములా ఎరుక అదియిది యననేల నంతయున్ ఎరుకే
చింతలకుపుట్టిల్లు చెలువైన యీ ఎరుక అంతుదెలియగ నీనివంతయీ ఎరుకా మొద
లును తుదిలేని మోసమా యీ ఎరుక నరక మోక్షములంచు వెరపించు నెరుక ఎరుక
యిట్టిదలంచు నెరిగి సీవెదలోన ఎరుక నేగాదంచు ఎరుగు మోయమ్మా ఎరుక
నేగాదంచు ఎరిగిననటుపైని ఎరిగెడిదేమున్న దెరుగుమోయమ్మా మూడవస్థ
లకును మూలమా యీ ఎరుక గోడులన్నిటిగన్న ప్రోడ యీ ఎరుకా తనకుతాచనుదెంచి
మనసుగా వికశించి గనజాడనశియించి గనబడదోయమ్మా ఘనమోసమాదీని గని
నమ్మకోయమ్మ ముంచునెవ్వరినైన మొదలంటకొమ్మా గానసీ ఎరెకకు కరములన్
ముకుళించి నీవెనీవైయున్న నినుజూచుకొమ్మా నీవెనీవుగనిన్ను నీవె జూచుకొనినచో
తానెనీవై యుండు తథ్యమోయమ్మా తానెనీవైనచో తనుమనః ప్రాణముల్ అనరాదు
వినరాదు అచలమీవమ్మా ఇట్టిదట్టిదటంచు యింతంతయనిగాని ఇంద్రజాలినివైన
ఎరుకపొడగాని కనబడని స్థితినీవుగావలెనోయమ్మ కావలెననియాసగలిగియున్న వినుమా

జరుగు వెంకటగురునిజాడ గనుమోయమ్మ జాడలోనున్నట్టిచేడె నేనౌమ్మా తోడి నీడా గురునిగూడినానోయమ్మ ధరను గాజుల రామదాసుండనమ్మా॥

శంకరాభరణం — అట.

కావుచిన్నది చూపులోపల కాపురంబుగనున్నది కోపతాపము లేమిలేకను ప్రావుదాపైయున్నది ॥కా॥ సోమసూర్యుల మధ్యగదిలో స్వామితానైయున్నది ప్రేమ యననేమోయెరుంగని స్వాములకు గనరానిది॥కా॥ జ్ఞానధనమైయున్నది యనుమాన ములులేకున్నది హీనగుణములప్రోలమిగిలిన తాను తానైయున్నది ॥కా॥ జాణతన ములులేనిది నెరజాణలకుకనబడునదీ జాణతనమన నేమొయెరుగని ప్రాణులకుకనబడ నిది ॥కా॥ చిత్తునత్తులుగానిది సదసత్తుతానైయున్నది చిత్తమెరిగినవారికెల్లను మొత్త మైకనుపడునదీ అండదండాలేనిదయ్యునఖండమై తానున్నది అండజేరినవారికెల్లను అండ దండైయున్నది ॥కా॥ దురభిమానులవీడిసరసుల మరిగిమరుగైయున్నది తరుగువరుగు లులేక నిరతము పరమపదమైయున్నది ॥కా॥ యుక్తిశక్తివిరక్తులెరిగిన ముక్తికాంతై యున్నది భక్తితత్వములేనికూళల యుక్తులకుగనరానిది ॥కా॥ తన్నుతానెరిగున్న భక్తుని కన్నులోపలనున్నది పన్నగాసద్గురునిగొలువని మన్నలకుగనరానిది॥కా॥ జనన మరణములేనిదీ ఖలజనులలోపలలేదది మననశీలుగకెల్లవెలుగై యనయమును గన

పడునదీ ॥కా॥ మూడుగుణములులేనిది పదమూడు మూడునుగానిదీ మూడు ముద్దలు దిన్నవారల జాడలోపలనున్నది ॥కా॥ దండివెలుగై యున్నదది నొయఖండతేజంబైనది కండ్లకొన్నడకన్నుగానని ముండలకుగనరానిది ॥కా॥ కరుణారూపంబైనది యేదురభిమానములేనిది గురుని నరుడని నరకుసేయుని కూళలకుగనరానిది ॥కా॥ మూడు మూర్తులకైన దెలియని జాడలోపలనున్నది పాశిదప్పినవారి నెప్పుడు గోడుగుడుపుచు నున్నది ॥కా॥ పంచముద్రలుగాక నెపుడు ప్రపంచమంటనున్నది పంచవింశతి విధ మెరుంగని వంచకులుగనరానిది ॥కా॥ దొంగలనుతరిమేటిదై యీదొంగలకుగనరానిది సంగరహిత మెరుంగువారల కంగరక్షైయున్నది ॥కా॥ అక్షరంబైయున్నది యావలక్షణంబులుగానిది కుక్షికైయల్లాడువారి విలక్షణంబుననున్నది ॥కా॥ హంసరూపంబైనదీ దేహింసలెరుగనిచిన్నది హింసజీవనమూను వారికిసంశయంబైయున్నది ॥కా॥ గురునినిరతమునాల్గువిధముల గొలువకుండినలేదదీ గురుని కేవల పరాత్పరుడని శరణుజొచ్చినయున్నది ॥కా॥ తెలుసుననిగర్వించు వారల తెలివికస్వాలనున్నది తెలిసితెలియని తత్వమందున నిలచికదంకయున్నది ॥కా॥ రేఖమాపులుగానిదీయీ చూపులకుగనరానిదీ చూపులనుచూపించునదిలో చూపులోగన్పడునది ॥కా॥ ధర్మకర్మములేనిది ధర్మమునులేకున్నది ధర్మమెరిగినవారి[illegible]ను నిర్మలంబైయున్నది

॥కా॥ రాకపోకలు లేనిది పలగాకులకు కనబడనిదీ వోకువేసుక చూచువారికి ప్రాకటంబైయున్నది ॥కా॥ జరుగు వేంకటగురివియాత్మలో జననమందిన చిన్నది ధరను గాజుల రామదాసును మరిగి మురియుచు నున్నది కాపుచిన్నది.

కాంభోజి—అట.

జోడుకుంటలమధ్య జోరీగయున్నది చూడరయ్యా అది జోడులేకను యీరేడు లోకములేలె చూడరయ్యా ॥జో॥ సారములేనట్టి పారేనదులుమూడు చూడరయ్యా జోరీగ నెరిగిన దారితెలియవచ్చు చేరరయ్యా ॥జో॥ ధర్మాధర్మములుండే మర్మమున్నదిదేమి కర్మమయ్యా ధర్మకర్మమూలమర్మమా జోరీగదలచరయ్యా ॥జో॥ మతిలేనివారితో మాటలాడుచునుండే చూడరయ్యా పతితులకెల్ల సద్గతియా జోరీగేమిహేతువయ్యా ॥జో॥ ముసలిదొక్కతి యీగపశమునందున్నది చూడరయ్యా వశమునందున్న యాముసలిదాని శక్తిచూడరయ్యా ॥జో॥ మూడుమూర్తుల కాదిమూలమా జోరీగచూడరయ్యా తనజాడ దెలియనీక వాడ వాడలనుండే కూడరయ్యా ॥జో॥ ఈగనుగన దొడ్డత్యాగమూనగవలె చూడరయ్యా రోగాదులున్నచో యీగదెలియరాదు చూడరయ్యా ॥జో॥ జరుగు వేంకటగురు జాడలోనున్నదిచూడరయ్యా ధరను గాజుల రామదాసుడాజోరీగ వేడరయ్యా ॥జో॥

## సావేరి—అట.

యింకనైననుమానవే మనసా నీమంకుతనమును ॥యిం॥ పొంకమగుసద్గురుని జేరియు మంకుతనమును వీడవైతివి డింకవేశి డొంకజేరెదు కుంకనీగతిగానవైతివి॥యి॥ దున్నపోతులతోటి చెలిమేలా నీవెన్నుగుండాకన్నుగానక తిరిగెదిదిమేలా యెన్ని విధములదెల్పినా నీకున్నగుణములు మానవైతివి నిన్నమొన్న నీల్గువారలకన్న ఘనమా మన్నుబొమ్మ ॥యిం॥ యిరుగు పొరుగులవారితో పోరానీనాలికారా క్రూరనరులతో కలయుటిదమేరా లేరులేరిక నీకుదిక్కా ధీరులౌసద్గురులకన్నను మారుమసలకు మింక నో పాచీర దేశికు జేరి కొలువవె ॥యిం॥ కూడుగల్గెనటంచు పొంగేలా నీకాడుగాల మూడుకాల్వలు దాటవదియేలా వాడవాడల జోడులేకను వేడుకతో నున్నాడు గురుడీ పాడుబుద్ధిసివీడి యాతని వేడుకొని దరిజేరవేఘీ ॥యిం॥ రాజరాజగు వెంకటేశుని గాజూల రామదాస వరదుండంచు గనుగొని రాజయోగులు నడచిరట యీ రాజమార్గము కండ్లజూచుక వాజిచేష్టలుమాను ముండ్లా భూజమా నీ కండ్లుబోను ॥యిం॥

## నాదనామక్రియ - ఆట

చిన్నదానా మీ దేవూరు సత్తు చిత్తు రెండును గాదు మావూరు పున్నదున్న

దయ్యా మావూరు రెండుకన్నులసందున మావూరు చిలకలూరుపేట మావూరు చచ్చివలికి జేరితె చూడు మావూరు॥ కాదన్నవారికి మావూరు వాదభేదములై తోచు మావూరు॥ మూడుకనమల కవలమావూరు మూడు మూడుదాటితె చూడు మావూరు ఆదియంత్యములేదు మావూరు ఖేదమోదము లెరుగదు మావూరు॥ జరుగు వెంకటగురుడు మావూరు మోక్షమరచేతజూపించు మావూరు॥

## అసావేరి - త్రిపుట.

డెందమా నీకేలయీవెర్రి ॥డెం॥ అందమౌగురు పాదద్వంద్వమందియు భయమందెదేల ॥డెం॥ బందరుపురమందున సద్భవమందియు గురుడానందముగను అందెవేశెదాసులనేలగ మందబుద్ధివిటూహింపగబోకు ॥డెం॥ సంకటమగు మూడేరుల నీవంకకైన రానివ్వడుబల్ మంకుదొంగలార్గురు యేయేవంకబోదురో గనుచుండవె పిరికి ॥డెం॥ మత్తగజంబులు ఎన్మిదియును మొత్తమైనమోసంబనుకొని తత్తరపడి భీతిజెందకు చిత్తమందె కలడేగురువరుడోసి ॥డెం॥ వెంకటగురువరు పాదంబుల వంకనె మదినిల్పుము తప్పక శంకలుమానుము యిలలోపలకుంకిలభయమేదే నీకికనాదు ॥డెం॥

కళ్యాణి - ఆది.

సచ్చరితుల సాంగత్యముదొరకెను మృచ్ఛులపొందికనేమిటికి హెచ్చగు తావక దివ్యకరుణచే పిచ్చిబాపివరమిచ్చినపిమ్మట ॥స॥ జంకుదీరి యొకవంకజేరి యికరంకుముండ బొంకులువిననేటికి ॥స॥ కంజజనక నీ స్మరణసేతు నే లంజజోలి నాకెందుకుతంత్రి ॥స॥ మీాసంబులపై తేనెకాసపడి మోసపోను నీ దాసదాసుడర ॥స॥ దానపోష వెంకటగురువర నీదాసులైన పుణ్యాత్ముల జేరితి ॥స॥

నాదనామక్రియ - ఆట.

ఎవరున్నారయ్యా తమకన్నా ॥నా కె॥ పరికింప ॥నా కె॥ వెంకటయోగి ॥యె॥ ఎవరున్నారనుచు నే నెవరి వేడుదునయ్యా వివరింపజాలని యావినీతినైపోతి ॥నె॥ అజ్ఞానాంధకార మావరించుటజేశి విజ్ఞాన ధనమున్న వినవైతిగాని ॥నా కె॥ తరుగు వరుగులేని కరుణాసాగర నిన్ను నెరనమ్మజాలని పరమ మూర్ఖమెకాని ॥యె॥ కరుణాసాగర నాకై నరరూపమును దాల్చి యరుదెంచినావని యెరుగనైతినిగాని ॥యె॥ మూాడుమూార్తుల కాదిమూాలము నీవని యేడువజాలక గోడుజెందితిగాని ॥ఎ॥ సంకట తిమిరార్క వెంకటరమణా నీవంక జేరనట్టి మంకుతనమె కాని ॥ఎ॥

ఆదుగో శ్రీశైలవాసుం డదుగో అను మట్టు

నాట - ఆది

అదుగో వేంకటసద్గురువరుడదుగో మమ్మేలిన సత్ప్రభుడదుగో॥ వేంకట॥ మూడుమూడు మూడారును రోశినజాడలో దొరకిన వేడుకగా డల్లదుగో॥ వెంక॥ వాదభేదముల కాదని రోశినసాధులు జూచినసమరసదర్శమ ॥డదు॥ వెంక॥ ఈ కొబూని పదమూటివిగూల్చిన మేటిశూరులకు వాటమైనవా ॥డదు॥ వెంక॥ కాటుకకొండల జోటికినదుమను మేటి యాచు త్రికూటమునందున ॥అదు॥ వెంక॥ పాపపుణ్యముల బారద్రోలి తనప్రాపు నొసంగెడి భక్తవత్సలుం ॥డదు॥ వెంక॥ ఇందునందు నొదెందునజూచిన సందులేని ఘన సుందరాంగు డల్లదుగో॥ వెంకట॥ హరిహర కమలాసన ముఖసురశేఖరులు నుతించెడి కరుణాసాగరు ॥డదుగో॥ వెంక॥ జరుగు కులాంబుధి చంద్రుడౌచు ధరజననము నొంది నశాంకరిలోలుం ॥డదు॥ వెంక॥ ఘనుడు మహాత్ముడు కరుణాంబుధిఘరనాజులరాముని కరుణించినప్రభు ॥డదుగో॥

రగడ - లేక మంజరి.

చెడుతావు మంకా చెడుతావుమంకా చెడిపోతావు మంకా
అడియాసలలో బడిపోతివి నీకడగానవు మంకా

వచ్చినదాదిగ మృచ్ఛలలోబడి తుచ్ఛుడవైతివి మంకా
సచ్చరిత్రులను గొలచిన గురుడిక మెచ్చుర నిను మంకా
పొట్టకోసమీ కట్టడివేసము గట్టితివిర మంకా
పట్టివేసముల నాత్మనైన దలపెట్టబోకు మంకా
కూటికోసమై యేటికి జేసెదు బూటకమిటు మంకా
వాటంబౌ గురుసూటిదెలుసుకొని దాటిపదర మంకా
దొంగలలో నొకదొంగవగుచు యిటు భంగపడకు మంకా
సంగరహితుడౌ అంగపురీశుని సంగతిగను మంకా
అమ్మలవలె పరకొమ్మలజూడుము నెమ్మదిలో మంకా
కొమ్మలగని చెడిద్రిమ్మరి చావకు దొమ్మరిపెద మంకా
మూడుకాల్వలనుదాటినవారికి జోడులేరు మంకా
బాడుగకొంపలు నేనని నమ్మకు గాడిదవలె మంకా
మదకరివలె గురుభక్తిలేక యిటు పదరబోకు మంకా
చెదరకుండ శ్రీగురు పాదంబులు మదిని నిల్పు మంకా
పాపుకొళ్ళలో తావులేమురా దేవునిగను మంకా

దేవునిగంటే పావుకోళ్ళకిక తావేలేదు మంకా
న్యాయాన్యాయము వీడితె తెలియునదోయంబుర మంకా
పూయబోకు మెయినిండ బూడిద విధేయుడవై మంకా
యెన్నిపేరులను బెట్టుకొన్న దీ దున్నపోతు మంకా
వన్నెమీరి చరియించుచున్న నీ తెన్నునుగను మంకా
శంకలు బాపిన వెంకటగురు దేవంకలగను మంకా
సంకటములు నీవంకకురావిక జంకబోకుమంకా
గాజులరామునికిడె సద్గురుడొక భోజనమ్ము మంకా
భూజనులందరి కబ్బబోదు ఘనరాజయోగమిది మంకా.

## షహార్ — మట్టు.

ఎందుదాగినావో గురుసుందరాంగ నన్ను బాసి ॥ఎ॥ మందమతినటంచునన్ను మరచిపోయినాడవేమొ ఎందుబోదుకన్నతండ్రి గుందుదీరయిందురారా ॥ఎ॥ మాయ తల్లికప్పగించినావే మారుమాటైనబల్కకేవెళ్ళినానే యేనాడూ నీదుభజేనసేయ కుండలేదే. నీదుమూర్తిచూడకుండలేనే నాదుపూర్వపుణ్యవశంబున నీయాత్మ

పుత్రుండనైతినని సంతసించుచుంటినే అన్యాయముంచు దోచలేదయ్యా నన్ను బాయుటా ॥ప॥ నీదివ్యమంగళవిగ్రహ రహితంబుచే యీశుకపుర సౌభాగ్యవతి నాదునేత్రంబుల కలంకారవిహీనమైదోచెనిండ్రీ యింకనీజన్మంబునకు నీసుమూర్తి దరిశనభాగ్యంబు నాకులేదా మటుమాయజేసిపోయి నాతోమాటలాడవేమిరా ॥ప॥ నీమబిడ్డలనేరికప్పగించి యిట్లులేగినావు అట్టిసుందరంబగు నీమమూర్తి నెచట దాచిపెట్టినావో (మొక్కేవనికనైన నామపక్కజేరరావేరా ॥ప॥ హా జరుగు వెంకట యోగీశ్వరా నన్నుబాసినావా యింకనైన నీదరిశనంబొసగుటకై యింతబిగువా గాజుల రామదాసుడన్నను కరుణజూడరాదోరా ॥ప॥

బేహాగ్ — ఆది.

భయహారతీస్వామికైకొని ఆదరించుకొనుమీ అహంకారనూనె చిత్తవృత్తి నామెయికుందిగ గనుగొనుమీ ॥జ॥ కారుగుణములారూ హారతికర్పూరముతీరూ భారమైననాదుదేహమే యొకపళ్ళెరంబుగేరు ॥జ॥ తాపమ్ములుమూడు నొకటిగ దలచితి దయజూడుమిక దీపమ్ములనెన్నైనజేయదగుజేకూదగుధీరుడ నీకదెచూడు॥జ॥ తారహారతేలనంతకుమీ.రె దాసపాలా ధారుణి గాజుల రామదాసునొకదరి జేర్ప వదేలా ॥జ॥

మోహన — ఏక.

గంగాధరనీకిదె జయమంగహారతీ శ్రీరంగపూజిత అంఘ్రియుగళ జేయ్ ఉమాపతి తారకాసురాది క్రూరదనుజసంహారా మారహరా రారదీనభక్తమందారా ॥గం॥ పంచాక్షరరూపరావ పార్వతీధవా నాసంచితములు బాపవు యేమంటి రా శివా పంచవింశతి తత్వసాక్షివంచువింటిగా ప్రపంచమంటియుంటనట్టి ఫక్కిగంటిగా ॥గం॥ జలజగర్భాద్యమరవినుతజాలమేలరా యలమిగాజుల రామదాసునేలరా వేరా ॥గం॥

సురట — అట.

మంగళం మంగళం సద్గురునాథా ॥మం॥ వెంకటయోగీ ॥మం॥ అంగలింగముల భంగమ్ము నెరిగించి సంగరహితస్థితి పొంగజేసి దొంగలనదలించి శృంగాటకము జేర్చి భంగమ్ము నుండినన్ బాపిననాతండ్రీ ॥ క్షరరూపమైనన్ జేపట్టి కరుణనక్షరరూపునిగ జేయు సమతనెంచి పరమదయాబ్ధీ నీకరము నాశిరమున విరివిగనుంచిన వెంకటప్రభురాయా ॥మం॥ పంద్రెండక్షరముల భావమ్ము బోధించి కొండవంటిభవము కూలద్రోశీ యండపిండబ్రహ్మాండములన్నిండిదండి వెల్గుచుయున్న దాతా ॥ జయతుజయ ॥మం॥ పంచదశాక్షరి భావమ్ము బోధించి సంచితాగాములు ద్రుంచి వైచీ పంచవింశతి తత్వపద్ధతి

కరుణించి యుచితముగను మన్నించిన నాతండ్రీ॥మం॥ షోడశాక్షరిలోని జాడనాకెరి గించి ఈడపింగళమధ్యమేడనుంచి తోడుస్థిరై సర్వగోడులనదలించి శాడుగతెను విడబాపిన నాతండ్రీ ॥మం॥ దీక్షతో మహావాక్యసాక్ష్యములనుజూపి మోక్షకాంక్ష నొక్కమూలద్రోశి నిక్షేపముగు సర్వసాక్షిగ ననుజేసి యక్షయమొసగిన యతిలోక మూర్తీ ॥మం॥ అష్టాంగయోగముల్ కష్టములని దివ్యనిష్టనొసంగి సంతుష్టిపరచి వ్యష్టిదయ్యమునట్టె నష్టమ్ముజేసి సమ్మిష్టినొసగు పరమేష్టి ॥జయతు జయ! పరమాత్మవయ్యునన్ కరుణింపసమకట్టి జరుగువెంకటగురుసాజ్ఞదాల్చి ధరయందవతరించి దాసునిగయునుంచి సరిలోకమొసగిన సర్వజ్ఞమూర్తీ ॥మం॥ సురయక్ష గరుడ గంధర్వపన్నగులైన హరిహరబ్రహ్మేంద్రులైనగానీ తరమా తెలియనిన్ను వరులెంతవారయ్యా ధరనుగాజుల రామదాసునేలినతండ్రీ ॥మం॥

ద్వితీయ భాగము

సంపూర్ణము.

—:o:—

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B137 |
| పుస్తకం పేరు | ప్రాణలింగ శతకము బ్రహ్మానంద సుధాలహరి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 107 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | narma |
| పేజీలు విడదీసినది | narma |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |